# మా దేశం



రచయిత:

ఏ. టి. చంద్రశేఖర్

ప్రభుత్వ వైఫల్యాలు ఏమో తెల్సుకొంటూ, వాటినుంచి విము క్తి కొరకు నెలకొనినది, మాదేశంపార్టీ అనెడి గ్రహింపు కొరకు ఉద్దేశించిన రచన ఇది.

ఇతర పుస్తకాలు :

1. పాలనా ప్రణాళిక
2. స్వంతపార్టీ
3. మాదేశంపార్టీ
4. ప్రజాస్వామ్యమా, పార్టీస్వామ్యమా
5. అధికారం ఒసంగండి

ప్రతులకు :

వి టి. చంద్రశేఖర్
48-4-20,
విశ్వకవి విద్యానికేతన్‌రోడ్డు
గుణదల సెంటర్
విజయవాడ-5.

ప్రథమ ముద్రణ;
మార్చి; 1988
కాపీలు; 250


ముద్రణ :
శ్రీ అన్నపూర్ణ ప్రింటింగ్ ప్రెస్
విజయవాడ.

# వి షయ సూ చి క

# ఉపోద్ఘాతం

ధర్మం న్యాయం నెలకొనేలా, అన్యాయాలు అక్రమాలు పైదొల గేలా, దుర్మార్గం ద్రోహం దోపిడీలు నశించేలా, నిరంకుశ పాలన లేకుం డేలా, ప్రజలంతా సమైక్యంగా జీవించేలా, ప్రజాభీష్టం నెరవేరేలా, పరిపాల నను జరిపించుకో కల్గిందుకే మాదేశంపార్టీ ప్రజలముందు ఉంచబడింది.

ఈ దేశంకోసం ఈ ప్రజకోసం, సరైన ప్రభుత్వం ఏర్పడిందా? లేదు. సరైనపాలన జరుగుతోందా? లేదు. 4 దశాబ్దాలుగా ప్రతి రంగం లోను దుష్ఫలితాలే. దేశవ్యాప్తంగా ఎన్నోరకాల సమస్యలు. ప్రజలు ఎన్నోరకాల కష్టనష్టాలకు బాధావేదనలకు గురవుతున్నారు. ప్రజల తరపున పరిపాలిస్తున్న ప్రభుత్వాలు, అసమర్థంగా అవినీతికరంగా ఉన్నాయి. పరి పాలించటం చేతకానివారి చేతుల్లో, దేశము ప్రజ బంధీ అయినారు. అదేమో తెల్సుకొందాము.

# ౹. శాంతిభద్రతలు

1. మనిషి మనుగడలో శాంతిలేదు. నిత్య జీవితంలో భద్రతలేదు. అడుగడుగునా మోసాన్ని, దుర్బుద్ధిని, బాధ్యతా రాహిత్యాన్ని, నేరప్రవృత్తిని, ఇలా వీటన్నింటిని ఎదుర్కొంటూ జీవించాల్సి వస్తోందంటే; ఎంత దౌర్భాగ్య పరిస్థితి దాపురించినట్లు?

2. దుర్మార్గులచే నీచులచే ద్రోహులచే కష్టాలు అనుభవించేలా, నేరస్థులచే బాధింపబడేలా, వంచన దగాకు నిరంతరం బలయ్యేలా, ఈ ప్రభుత్వ పాలన ఉంది అన్న విషయాన్ని ఈప్రజ గుర్తింపలేదా?

3. నేరాలు అరికట్టేందుకు ప్రభుత్వమా? నేరాలను పెంచిపోషించేందుకు ప్రభుత్వమా? మితిమీరిన జనాభా, మితిమీరిన నగరీకరణ, మురికివాడలు, అస్పృశ్యత, వెట్టిచాకిరి, చాలీచాలని జీతాలు, కనీసవేతనాల నిరాకరణ, నిరుద్యోగము, ఆర్థిక ఇబ్బందులు, అసమానతలు, పెరిగేధరలు, విలాసాలు, వినోదాలు, మద్యం మత్తుమందులు, జూదశాలలు, ఎమ్యూజ్‌మెంట్ పార్కులు, అశ్లీల సాహిత్యం, సెక్సీవేషధారణ, దొంగరవాణా, అక్రమ నిల్వలు, బ్లాక్‌మార్కెట్, ప్రభుత్వ అవినీతి, అక్రమలావాదేవీలు, అధికార దుర్వినియోగం, ఆంతరంగిక అల్లర్లు, నేరాలు పరిష్కరింపబడక పోవటం, నేరస్థులు తప్పించుకొనటం, సంఘవిద్రోహులకు రాజకీయ ఆశ్రయం, నైతిక విలువల పతనం, ఇట్టి పరిస్థితులలోకి కొనితేబడ్డాము.

4. నేరప్రవృత్తిని నిరోధించేందుకు చట్టాలైతే చాలా ఉన్నాయి కాని ఏమి లాభం? వాటిని సక్రమంగా అమలు చేసేది ఎవరు? చట్టాలను ఉల్లంఘించటం సాధారణమైంది. నేరాలు జరగనట్టి ప్రదేశం లేకుండా పోయింది.

5. ఇళ్ళల్లో దుకాణాల్లో దొంగల బందిపోట్ల దొంగతనాలు, భద్రత

లేని దేవాలయాలు, సైకిళ్ళు స్కూటర్లు కార్లు దొంగిలించటం, చిల్లర మల్లర దొంగతనాలు, జేబులు కొట్టడం, పట్టపగలే దారిదోపిడీలు, బ్యాంకు దోపిడీలు, ఉమ్మడి ఆస్తులచోరీ, మనుష్యులను ఎత్తుకుపోవటం, విమానాలను దారిమళ్ళించటం, గూండాముఠాల చేతుల్లో గ్రామాలు, నగరాలందు గూండాల పాలన, ఉత్తర భారతంలో బందిపోట్ల ఘాతుకాలు, దేశవిద్రోహక కార్యకలాపాలు, తీవ్రవాదులు నక్సలైట్ల హింసాకాండ, కులమత కలహాలు, హింసాదౌర్జన్యాలు, బలహీన వర్గాలపై దౌర్జన్యం, దొమ్మిలు అల్లర్లు, గ్రామకక్షలు, పగసాధింపు, కక్షలతో నిప్పెట్టడం, కక్షలతో హత్యలు, ఆస్తికోసం హత్యలు, ఆస్తివివాదాలు, భూమి తగాదాలు, కుటుంబ కలహాలు, వరకట్నపు మరణాలు, సెక్సునేరాలు, స్త్రీలపై అత్యాచారాలు, వ్యభిచారం, నమ్మకద్రోహం, ఫోర్జరీ, దొంగఏజెంట్లు, దొంగ సంస్థలు, విదేశీ వస్తువుల అక్రమవ్యాపారం, మాదకద్రవ్యాల అమ్మకం, దొంగనోట్ల ముద్రణ చలామణీ, కల్తీలు కాలుష్యాలు, రాజకీయ స్పర్థలు, ముఠాతగాదాలు, రాజకీయవర్గాల దౌర్జన్యం, రాజకీయ హత్యలు, నేరస్థులకు రాజకీయవాదుల అండదండలు, ఇలా ఎన్నోరకాల నేరాలు. నేరాలను ఒక వృత్తిగా, ఒక పరిశ్రమగా అనుమతిస్తున్న పాలన ఏమో ఇది!

6. శాంతిభద్రతలను కాపాడవల్సిన ప్రభుత్వ యంత్రాంగం, శాంతి భద్రతలనే భగ్నం చేస్తుంటే- ఏవి నేరాలను ప్రోత్సహిస్తవో, వాటినల్లా పెంచి పోషిస్తున్న ప్రభుత్వం ఇదవుతుంటే- శాంతిభద్రత పగటికలకాక మరేమవుతుంది? కనీసావసరాలు సమకూర్చటంలోనేగాక, నిత్యజీవితంలో మనుషులు శాంతితోను భద్రతతోను జీవించకలిగేలా పాలించటంలో- ఘోరంగా విఫలమైన ఈ పార్టీ ప్రభుత్వాలను అనుమతించటం అవివేకం కాదా! అందుకే మరందుకే;

మనకొక స్వంతపార్టీ మాదేశం

)—(

# 2. దేశసమైక్యత సమగ్రత

## కులమత కలహాలు

1. ప్రజలలోకల కులాభిమానాన్ని కులదురభిమానంగా, మతాభిమానాన్ని మత దురభిమానంగా మళ్ళించి, రాజకీయ ప్రయోజనాలు పొందుతున్నారు. అధికారాన్ని చేజిక్కించుకొందుకు, రాజకీయ ఎత్తుగడలకు, కులమత వ్యవస్థలను ఉపయోగించుకుంటున్న పార్టీలివి.

2. తమ ప్రాంతీయుల, తమ వర్గీయుల, తమ మతస్థుల ఓట్లు పొందేందుకు, వారిని తమవైపుకు చీల్చుకొనాలి. తమకు అండదండలు ఒసంగేవారిగా, వారిని ఆకట్టుకొనాలి. అందుకు కులమతభాషా ప్రాంతీయ తత్వాలను, అసమానతలను ఉపయోగించు కుంటున్నారు. ప్రజలలో అసంతృప్తిని విద్వేషాలను ప్రేరేపిస్తూ, ప్రాంతీయంగా బలమైన స్థానం పొందటానికి, ఆంధోళనలు చేపడుతున్నారు. ఇట్టి కుతంత్రాలవల్ల పౌరులు; హిందువులుగా సిక్కులుగా ముస్లింలుగా వేరవుతున్నారు.

3. కులాలకు మతాలకు వర్గాలకు బాషలకు, భిన్నమైన దృష్టితో ప్రజలను పరిపాలించకుండా-తమ కుల, తమ మత, తమవర్గ, తమభాష, తమప్రాంత దృష్టితో-ప్రజలు తమలోతాము కలహించుకునేస్థితికి కొనిపోబడ్డారు. రాజకీయవాదుల వైఖరులే, భిన్న మతస్థుల మధ్య ఘర్షణలను సృష్టించాయి.

4. హిందూ ముస్లిం కలహాలు, పౌరుల శాంతిభద్రతలకు విఘాతం కల్గిస్తున్నాయి. ఇరువర్గాలు అభిమాన దురభిమానాలకు లోనై. పరస్పర విద్వేషాగ్నికి లోబడి, సంకుల సమరం జరుపుతున్నారు. మతకలహాలను నివారించటం ఈ ప్రభుత్వం వల్లకాదు. ప్రభుత్వం చేతగాని తనానికి, ఎన్నికల రాజకీయాలకు; అచ్చటి పౌరులు దాడులకు గురవుతున్నారు. ఎందరో

ప్రాణాలు పోగొట్టుకుంటున్నారు. ఎందరివో ఆస్తులు ధ్వంసమవుతున్నాయి దేశసమైక్యతకే ప్రమాదం ముంచుకొచ్చింది.

## ఆందోళనలు, ఉద్యమాలు

5. వివిధరాష్ట్రాల మధ్య, వివిధ ప్రాంతాలమధ్య- విద్య, ఉపాధి, వైద్యం, పారిశ్రామికీకరణ వంటి పలురంగాల అభివృద్ధిలో- అసమానతలు పెంచబడ్డాయి. ఆకారణంగా సాంఘిక ఆర్థిక సమస్యలు తలెత్తాయి. ఈ అసమాన అభివృద్ధివల్ల, ప్రాంతీయ అభిమానాలు ప్రాంతీయ తత్వాలు చెలరేగాయి.

6. ఒకవర్గం లేదా ప్రాంతం లేదా రాష్ట్రం లేదా ఒకజాతి- తమ సమస్యల పరిష్కారం నిమిత్తం చేపట్టే ఉద్యమాలు ఆందోళనలువల్ల, కుల మతకలహాలవల్ల, హింసాకాండ చెలరేగుతోంది. దీనిచే ఒకరిని మరొకరు కోల్పోతున్నారు. జీవించాల్సిన ఎందరో మరణిస్తున్నారు. గాయాలతో అంగవైకల్యంతో మరికొందరు, బ్రతికి బయట పడుతున్నారు. దుఃఖిస్తున్నారు.

7. ఆందోళనలు ఉద్యమాలు పేరిట సంఘవిద్రోహశక్తులు- అక్రమ ఆయుధాలతో, ప్రేలుడు పదార్థాలతో, భయోత్పాతాన్ని సృష్టిస్తున్నారు. దారుణ మారణకాండకు అనేకానేకులు బలైపోతున్నారు. తమ దేశంలోనే తమకు రక్షణలేకుండా పోయింది! ఎందుకిలాంటి ప్రభుత్వం? ఇది ఎవరి కొరకు?

8. పొరుగుదేశాలనుంచి విదేశీయులు, మన సరిహద్దు ప్రాంతాలలోకి అక్రమంగా ప్రవేశిస్తున్నారు. పశ్చిమ బెంగాల్‌లోకి 50లక్షలమంది, బీహార్ లోకి 10లక్షలమంది, బాంగ్లాదేశీయులు ప్రవేశించారు. ఈశాన్య భారతంలోకి లక్షలాదిమంది ప్రవేశించి, నివాసం ఏర్పరచుకున్నారు.

9. పాకిస్తాన్‌తో సరిహద్దులు కల జమ్మూకాశ్మీర్‌లోకి, రాజస్థాన్‌లోకి. గుజరాత్‌లోకి- ఈ పాకిస్తానీయులు పెద్దసంఖ్యలో ప్రవేశించారు. దక్షిణాదిన కేరళ రాష్ట్రంలోను స్థావరం ఏర్పరచుకున్నారు. జమ్మూకాశ్మీర్; పాకిస్తాన్ గూఢచారులకు స్మగ్లర్లకు బందిపోట్లకు నిలయమైంది. స్మగ్లింగ్ హింస పెరిగిపోతున్నది. పాకిస్తానీయులు ఆయుధాలతో ఆర్థిక సహాయంతో, ఉగ్రవాదులకు సహకరిస్తున్నారు.

10. అసెంబ్లీ నియోజక వర్గాల ఫలితాలపై, విదేశీయుల ఓట్ల ప్రభావం ఉంటోంది. విదేశీయులను వోట్లనిధిలా ఉపయోగించుకుంటూ, వారి వలసను ఉపేక్షించిన పార్టీ ప్రభుత్వాలివి. సరిహద్దు ప్రాంతాలను పరదేశీయులకు స్థావరాలుగా జేసి, దేశ భద్రతకు ప్రమాదం వాటిల్ల జేసిన కాంగ్రెస్ ప్రభుత్వం ఇది.

11. దేశ పరిపాలనను సక్రమంగా కొనసాగించి ఉంటే, విదేశీయుల అక్రమప్రవేశాలను అరికట్టిఉంటే, ఆంధోళనలు అల్లరులు తలెత్తేవికావు. కులాలవారీ మతాలవారీ వర్గాలవారీ చీల్చి వారిమధ్య కార్చిచ్చుపెట్టి- తమ స్వప్రయోజనాలు, రాజకీయ ప్రయోజనాలు నెరవేర్చుకొన్న, ముఠాలు నాయకుల వలనే, పైదుస్థితి వాటిల్లింది.

12. అధికారం కొరకు కులమతతత్వాల ప్రేరేపణ వర్గవైషమ్యాలు అధికారంకొరకు- ఆంధోళనలు అల్లరులు అరాచకము– అధికారం కొరకు ప్రాంతీయ సమస్యలతో ప్రాంతీయ ఉద్యమాలు- అధికారం కొరకు ఎన్నికలు పార్టీలు రాజకీయ ఎత్తుగడలు వంటివాటిచే, దేశసమైక్యతా పరిరక్షణ అసాధ్యంగా ఉంది.

13. సాంఘిక ఆర్థిక దోపిడీని కొనసాగనివ్వటం, మైనారిటీవర్గాలను అణచివేయటం, వేర్వేరు మతస్థుల మధ్య వేర్వేరు ప్రాంతాలమధ్య వివక్షను కొనసాగించటం, తప్పుడు నిర్ణయాలు వంటి చర్యలకు పాల్పడిన రాష్ట్రకేంద్ర మంత్రివర్గాల వల్లనే; ప్రజల దేశ సమగ్రతకు విఘాతం వాటిల్లింది.

14. అధికారకాంక్షా రాజకీయాలకు చెల్లిస్తున్న మూల్యం, ఎంత అమానుషంగా ఉందో గుర్తించారా? అంతేగాక ఉత్పాదనలో ఎగుడు దిగుడులు, ఆర్థిక వ్యవస్థ దెబ్బతినటం వంటి దుష్ఫలితాలు కల్గుతున్నాయి.

---

15. దేశ పరిపాలన పరాయి పాలకులనుంచి, స్వదేశీపాలకుల చేతుల్లోకి మారింది తప్పితే; దేశసమైక్యత సుస్థిరం కాలేదు. శాంతి నెలకొనలేదు. దేశసమైక్యతా పరిరక్షణ అసాధ్యమన్నంతగా పరిస్థితి విషమించుతోంది.

16. ఓట్లకోసం అధికారం కోసం వేర్వేరు పార్టీలమధ్య, రాజకీయ వాదుల మధ్య పోటీవల్లనే; జాతులమధ్య, కులమతాలమధ్య, వర్గాలమధ్య, ఐక్యతకు బదులు పోరాటం నెలకొంది. ఈ రాజకీయవాదుల లక్ష్యం దేశ సమైక్యతకాదు. మతం ఆధారంగా, వర్ణం ఆధారంగా, భాషల ఆధారంగా; ఆందోళనలను అల్లర్లను వేర్పాటు వాదాన్ని రగిలించి, అధికారాన్ని చేపట్టడం. ఈ తరహా రాజకీయ వ్యవస్థ వలనే, దేశభద్రతకు ప్రమాదం వాటిల్లింది. ఇది పార్టీప్రభుత్వాల సమస్యకాదు, ప్రజల జీవన్మరణ సమస్య. దేశ భవిష్యత్తుకు ప్రజాభవిష్యత్తుకు వాటిల్లిన ముప్పు ఇది.

17. భవిష్యత్తు మనదిగా, మనం ఒకటిగా జీవించేందుకు- మనదేశ సమైక్యత వేలాది సంవత్సరాలుగా కొనసాగుతూ, కాలంతోబాటు కదిలేందుకు; స్వపరిపాలనే లక్ష్యంగా ఉద్యమిద్దాం. మన ఆశయ సాధనకు వచ్చే ఎన్ని అడ్డంకులనైనా తుదముట్టించేందుకే,

మనకొక స్వంతపార్టీ మాదేశం

# 3. పోలీసులు

1. నేరాలను అరికట్టడంలో, నేరస్థులను పట్టుకోవడంలో, సంఘ విద్రోహులను అరాచకాన్ని అలజడులను అణచివేయటంలో; పోలీసు యంత్రాంగం సమర్థవంతంగా పనిచేయటంలేదు. భద్రతా ఏర్పాట్లలో వైఫల్యం ఎదురవుతోంది.

2. పోలీసు విధులలో రాజకీయజోక్యం పెరగటంవల్ల, రాజకీయ ప్రయోజనాలకు పోలీసులను ఉపయోగించు కొనుటవల్ల, శాంతిభద్రతల సమస్యలు క్లిష్టం అవుతున్నాయి.

3. ఎన్నో నేరాలు జరుగుతున్నాయి. అవి అన్నీ నమోదు కాబడటం లేదు. కాబట్టి వాటిపై దర్యాప్తు జరగటంలేదు. అంతేగాక రాజకీయ ఒత్తిడులవల్ల, నేరస్థులను నిర్బంధించటం లేదు. పోలీసులు తమ విధుల నిర్వహణలో, అవినీతికి బంధుప్రీతికి పలుకుబడికి లోనవుతున్నారు. ఫలితంగా ఎందరో నేరాలను నిరాటంకంగా చేస్తున్నారు. సంఘవ్యతిరేకులు, గూండాలు, ఆర్థిక నేరస్థులు, రాజకీయవాదులతోను; పోలీసులు కల్గిఉంటున్న లావాదేవీలు కారణంగా, దుష్ఫలితాలు సంభవిస్తున్నాయి.

4. నేరం చేస్తే ఎలాంటి శిక్షను అనుభవించాలోనన్న భయం లేకుండా పోవటంచే, తిరిగి నేరాలను చేస్తున్నారు. నేరస్థులకు కఠినశిక్షలు విధించటంలోకూడా వైఫల్యమే ఉంది. దురాగతాలకు పాల్పడే అపరాధులను, వెన్వెంటనే విచారించి శిక్షింపలేకున్నది. ఈ ప్రభుత్వము, ఈ న్యాయవ్యవస్థ, ఈ పోలీసుస్టేషన్లు ఇవేవి- నేరాలను అదుపుచేయ లేకున్నవి. ప్రజలకు శాంతి భద్రతలను చేకూర్చటంలోని వైఫల్యాల కారణంగా; ప్రజలు నిరంతర అశాంతి ఆందోళనలకు గురవుతున్నారు.

5. పోలీసులను అదుపులో పెట్టలేని ఈ ప్రభుత్వంవల్లనే; పోలీ

సులు చేస్తున్న నేరాలకు అక్రమాలకు సైతం, ఈ ప్రజబాధలు పడాల్సి వస్తోంది. తప్పుడు ఆరోపణలు బెదరింపులు, హింసాదౌర్జన్యాలు, పోలీసుల చేతుల్లో మరణాలు అత్యాచారాలు, పౌరులపై కాల్పులు విధ్వంసం వంటి దమనకాండకు, అతీతంగా పోలీసు యంత్రాంగాన్ని- ప్రజలు నచ్చేమెచ్చే రీతిలో పని చేసేట్లు ఉపకరింపజేయలేని ప్రభుత్వపాలన ఇది.

6. ప్రజల స్వేచ్ఛను కాపాడేవారుగా పోలీసులు ఉండాలికాని, వేధించే వారుగా కాదుకదా. సాధారణ ఉద్యోగులతో ఎలాంటి సంప్రదింపు ఉం టుందో, అటులనే పోలీసులతో ప్రజలు వ్యవహరించే తీరును సాధ్యపరుచు కొందుకే,

మ న దై న పా ర్టీ మా దే శ ం

# 4. న్యాయ స్థానాలు

1. ప్రభుత్వం న్యాయం చేకూర్చేదిగాను, చట్టాలను అతిక్రమించిన వారిని శిక్షించేదిగాను ఉండవలదా? వివాదాలలో చిన్నవీ పెద్దవీ కూడా విచారణలోకి వచ్చి, తీర్పు వెలువడే సరికి దీర్ఘకాలం పడుతోంది.

2. న్యాయంకోసం క్రింది కోర్టుల నించి పై కోర్టులదాకా తిరగనవసరం లేకుండానే, కోర్టులలో న్యాయం లభిస్తోందనీ, అన్యాయం జరగటంలేదనీ నిరూపణకు; కోర్టుల కెక్కిన వారినుంచేకదా సమాచారం లభించాలి.

3. ప్రజలు తమకు లభించాల్సిన న్యాయంకోసం; కోర్టులచుట్టూ, పోలీసు స్టేషన్‌లచుట్టూ కాళ్ళరిగేలా తిరిగి-నిరాశానిస్పృహల పాలవుతున్నారోలేదో ప్రజలకు తెలియనిదా?

4 శాసనపరంగా లభించుకోవల్సిన హక్కులనే పొందలేక పోతున్నవారు, ఇక శాసనపరిధిలోలేని వివాదాలకు పరిష్కారాలను పొందటం సాధ్యపడేనా? ఒక పక్షం గెలిస్తే, రెండో పక్షం మరల అప్పీలు, ఇలా ఈ కోర్టు లావాదేవీలలో చిక్కుకొని, ఇఖ్యాలఖ్యా గుల్లచేసుకోలేక అన్యాయాలను సైతం భరిస్తూ బ్రతికే వారెందరో? కనీసం కోర్టుల విచారణలోకి వచ్చిన కేసులైనా, సత్వరమే పరిష్కరింపబడుతున్నాయా అంటే అదీలేదు.

5. కోర్టులలో కేసు నడిపేందుకు స్టాంపుఫీజు, లాయరు ఫీజు, వాయిదాల కయ్యే ఖర్చులు భరిస్తూ; న్యాయంకోసం పడే తిప్పలు ఎన్నో? ఫిర్యాదుల విచారణలో, కోర్టు తీర్పులో-ఏదో లోపం ఉంది. నేరం చేసినట్లు సాక్ష్యాధారాలు బలంగా ఉంచేనే శిక్ష, లేకుంటేలేదు. సాక్ష్యాలను కప్పిపుచ్చటమో, లేకుండా చేయటమో లేక దొంగ సాక్ష్యాలతోనో; నేరస్థులు నిరపరాధులుగా తప్పించు కొంటున్నారు.

6. ఈ విచారణా విధమే తికమక వ్యవహారంతోను, జాప్యంతోను కూడి ఉంది. కేసులు వాయిదాలు పడుతుంటాయి. తీర్పులు లభించేదెప్పటికో

తెలియదు. వారాలు నెలలుకాదు, సంవత్సరాల తరబడిగా న్యాయం కొరకు ఎదురుచూడాల్సివస్తే; అట్టి న్యాయవ్యవస్థ నుంచి ఏ ప్రయోజనం పొందగలరు? ఏ అన్యాయాలను నిరోధించగలరు? ఏనేరాలు జరగకుండా అదుపు చేయగలరు?

7. న్యాయంకోసం ఆక్రోశించేవారికి న్యాయం లభిస్తున్నదా? అన్యాయాలను సహిస్తూ బ్రతుకుతున్నవారికి, న్యాయం లభించేనా? ప్రజల ఫిర్యాదులను విని త్వరత్వరగా పరిష్కరించేలా, న్యాయవ్యవస్థ రూపొందలేదు. ఇది ఈనాటి పరిస్థితులకు తగినదికాదు.

8. కోర్టుల ముందుకు ఏటా సగటున సివిల్‌కేసులు 30 లక్షలు, క్రిమినల్ కేసులు 83 లక్షలు వస్తున్నాయి. హైకోర్టుల వద్దకు ఏటా 7 లక్షల కేసులు వస్తున్నాయి. కోర్టులందు కేసులు పరిష్కారం కాకుండా ఉండిపోతున్నాయి. క్రిందిస్థాయి సివిల్ క్రిమినల్ కోర్టులలో, అపరిష్కృతంగా ఉన్న కేసుల సంఖ్య, ఒక కోటికి పైగాఉన్నాయి. వివిధ రాష్ట్రాల హైకోర్టులలో ఈ సంఖ్య 12 లక్షలదాకా ఉంది. సుప్రీంకోర్టులో అయితే ఈ సంఖ్య ఒకటిన్నర లక్షలు. పది సంవత్సరాలు జరిగినా పరిష్కారం కాకుండా ఉంటున్న, కేసుల సంఖ్య లక్షలలోనే ఉంది.

9. కొందరిలోని స్వార్థము దురాశ వంచన దౌర్జన్యము-న్యాయాన్ని ధర్మాన్ని కాలరాచి వేస్తున్నప్పుడు-అనేకులు అన్యాయానికి గురవుతారు. ఎందరికో రక్షణ నశిస్తుంది. న్యాయం లభిస్తుంటే, నేరాలు నిరోధింపబడతాయి. వంచించేవారు వంచింపబడే వారు, లేరేమో అనిపిస్తుంది.

10. ధర్మంకొరకు న్యాయంకొరకు పరితపియించే అశేషప్రజల గుండెలలో సంతోషాన్ని నింపేందుకే, మనకొక స్వంతపార్టీ మాధ్యేయం.

]....()....[

# 5. వ్యవసాయం

1. ఆహార ఉత్పత్తులలో ప్రతిది ప్రజల అవసరాలకు తగ్గట్టు ఉత్పత్తి చేస్తూ, నిల్వ చేయలేని ఈ ప్రభుత్వ పాలన ఎవరికోసం? పన్నుల ద్వారా పెరిగే ధరలచే మరియు బీదరికంద్వారా, కొనటాన్ని తినటాన్ని నిలిపివేసి; నిత్యావసర సరకుల కొరతలే లేవని ప్రకటించుకుంటున్న ప్రభుత్వం ఇది.

2. మనకు దాదాపు 18 కోట్ల టన్నుల గింజధాన్యాలు అవసరం. కాని నేటి ఉత్పత్తి 15 కోట్ల టన్నులే. కేవలం గింజధాన్యాలలోనే మిగులు గాక, పప్పులు నూనెలు కాయగూరలు పళ్ళు పంచదార మొదలగు వాటి ల్లోను, మిగుళ్ళు ఏర్పడాలి.

3. పశువులు కోళ్ళు బాతులు గొర్రెలు పందులు చేపలు మొదలగు వాటి పశుగ్రాసముదాణాకు, సరిపడా ఉత్పత్తి అవ్వాలి. ఏడాదికేడాది పెరిగే జనాభాకు అదనపు ఉత్పత్తి కావాలి. ఎగుమతులకు నిజమైన మిగుళ్ళు లభించాలి. ఈ మిగుళ్ళు లేదా నిల్వలు, ప్రజావసరాలు సంతృప్తిగా నెరవేరిన పిదప ఏర్పడినవి మాత్రమే కావలెకాని-దారిద్ర్యంవల్ల అధికాధిక ధరలు వల్ల ఏర్పడే మిగులుకారాదు.

4. సేద్యపుభూమి, నీరు, తదితర వనరులకు కొదవలేని భారత దేశప్రజ నేటికి అధిక ధరలతో సతమతమవుతోంది. పప్పులు నూనెలు కాయగూరలు పంచదార పళ్ళు అన్నింటికి,ఆకాశాన్నంటిన ధరలు·ధరలిలా ఉంటే ఏవిధంగా కొని తినగలరు? వేటిని ఎందరు కొనుక్కోకల్గుతున్నారు?

5. వేర్వేరు ఆహారపదార్థాల వాడకం తగ్గింది. పిండివంటలు టిఫిన్లు తయారీతగ్గింది. చిరుతిళ్ళు తగ్గాయి. పై వాటిచే తినకలిగేది, జీర్ణించుకునేది తగ్గింది. ఆ తగ్గటంచే ఆకలి తగ్గింది. దీనిచే తక్కువ తినేదే ఎక్కువ అన్పిస్తున్నది. పిల్లల పెద్దల ఆహారం; రోజుకు ఏ పరిమాణంలో, ఏ పోషకాహారంతో, ఉందనేది ముఖ్యం.

6. వ్యవసాయక ఉత్పత్తులు తగ్గిపోయే పరిస్థితులు ఏవో; వాటికే ఈ ప్రభుత్వం దోహదపడింది. వ్యవసాయోత్పత్తులను పెంపొందించే కృషిని రైతులకు వదలివేయటమేగాక, రైతులకు అవసర సహకార సదుపాయాలను, ఈ ప్రభుత్వం సమకూర్చలేకపోయింది.

7. రైతులలో 41 శాతం చిన్నరైతులే. వ్యవసాయ పథకాలు; చిన్నరైతులకు ఎట్టి ప్రయోజనం కల్గింపలేకపోయాయి. కొత్తరకపు వంగడాలను ఎరువులను మందులను సరఫరాచేస్తూ, నీటిపారుదల విద్యుద్దీకరణతో, ఎక్కువ దిగుబడులు సాధించేపని. అది లేదు.

8. ఒక రైతుకి వేర్వేరు చోట్లగల పొలం అంతా, ఒక్కచోటనే ఉండే విధంగా; దేశమంతా అమలు జరపలేదు. భూసంస్కరణల అమలు సక్రమంగా జరగలేదు. కౌలుదారీ పద్ధతులు సక్రమంగాలేవు. చిన్నకమతాల ఉత్పాదక శక్తిని పెంచలేదు.

9. ఆర్థిక స్తోమతలేని పేదరైతులకు అప్పులిచ్చి ఆదుకోదు. సేద్యపు ఖర్చులకై ఎక్కువ వడ్డీకి తెచ్చుకోక తప్పటంలేదు. నీటికొరత, విద్యుత్‌కొరత, కల్తీ విత్తనాలు అమ్మకంవల్ల; దిగుబడులుతగ్గిపోతున్నాయి ఎరువులలో క్రిమి మందులలో కల్తీలు. ఇంకా బ్లాక్‌లో కొనుగోలు. పండించిన పంటల కొనుగోలును, మధ్యదళారుల పాల్జేసింది. ఇలా రైతాంగాన్ని పలుకష్టాలకు గురిచేసిన ప్రభుత్వం ఇది.

10. వ్యవసాయంలో అనిశ్చిత పరిస్థితి లేదా ఒడిదుడుకులు, ప్రభుత్వ ప్రణాళికా లోపంవల్ల కల్గుతున్నవే. తుఫాన్లు వరదలు కరవు కాటకాలతో, రైతాంగం నష్టపోతూనే ఉంది. ఆహార దిగుబడులలో ఎక్కువ తక్కువలు, పంటలు దెబ్బతినటం తప్పలేదు. పేదలకు పనులు దొరకటం లేదు.

11. రైతులకు సేకరణ ధరలు గిట్టుబాటు కావటం లేదంటే, ఉత్పత్తి ఖర్చుల పెరుగుదల ఒక ముఖ్యకారణం. బాగా పండినపుడు

లేనపుడుకూడా; వినియోగదార్లకు ఏవి తక్కువ ధరకు లభించలేదు. ఆహారోత్పత్తి వాణిజ్యంగా మార్చబడిందేగాని, ప్రజల అవసరాలు తీర్చేందుకుగాలేదు.

12. రకరకాల పన్నులువేసి, ఉత్పత్తుల ధరలు పెరిగేలా చేస్తారు. మరలా చౌకగా అందించటంపేర, సబ్సిడీలు ఇస్తారు. పన్నులు సబిడ్సీలు ఇదొక తతంగం.

## ఎరువులు

13. ఉత్పత్తుల పెరుగుదలకు ఎరువుల వాడకం తప్పనిసరి. తగ్గిన భూసారం; ఎరువులచే భర్తీచేయ బడుతుంది. సేంద్రియ ఎరువుగా పనికి వచ్చే పశువులపేడ, కలుపు మొక్కలు, తదితర చెత్తా చెదారం - సద్వినియోగం కావటంలేదు. ఎంతగానో వ్యర్థమవుతున్నాయి. రానురాను పొలాలందు భూసారం తగ్గుతున్నది. ఎరువుల ధరలు చిన్నరైతులకు అందుబాటులోలేవు. ప్రమాదకరమైన ఎరువుల అమ్మకము జరుగుతోంది. రసాయన ఎరువుల వాడకంలో, సరైన పద్ధతిలేని కారణంగా వృథా జరుగుతోంది.

## క్రిమిమందులు

దేశంలో తెగుళ్ళ నిర్మూలనకై 311 క్రిమి మందులను వాడుతున్నారు. వాటిల్లో 75 మందులు ఇతర దేశాలలో నిషేదించబడ్డాయి. వ్యవసాయంలో 60 వేల టన్నులకుపైగా క్రిమి మందుల వాడకం ఉంది.

15. క్రిమిసంహారకాలు విచక్షణా రహితంగా వాడబడుతున్నాయి, వాటిల్లో చాలా ప్రమాదకరమైనవి ఉన్నాయి. చీడలు తెగుళ్ళ నిర్మూలన సమర్థవంతమైన రీతిలోలేదు. ఆకారణంగా మందులకి తట్టుకొని బ్రతికే క్రిమికీటకాలు పెంపొందాయి. 364 తెగుళ్ళపై క్రిమి సంహారకాల ప్రభా

వం లేకున్నది. మొక్కల ఆరోగ్యము చెడి, అవి తెగుళ్ళదాడికి తట్టుకో లేకున్నాయి.

16. క్రిమిమందులన్ని విషపూరితం. అవి తెగుళ్ళను నిర్మూలించ టమేగాక, ప్రజల ఆరోగ్యానికి ప్రమాదకరమయ్యాయి. పరిసరాలు ఆహా రోత్పత్తులు విషకలుషితం అవుతున్నాయి.

17. క్రిమిమందుల వాడకంలో తగిన నియమావళిలేదు. తగినశిక్షణ సామగ్రి సమకూర్చబడలేదు. ఆకారణంగా ఎందరో వ్యాధిగ్రస్థులవుతూ బాధలను అనుభవిస్తున్నారు.

18. తెగుళ్ళ నిర్మూలనకు క్రిమిమందులపైనే పూర్తిగా ఆధార పడేట్లు చేశారు తప్పితే-జీవసంబంధ నియంత్రణ గూర్చిన చర్యలేలేవు.

## బంజరులు

కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలకు చెందిన బంజరు భూములు, వృధాగా నిరుపయోగంగా పడిఉంటున్నాయి. సాగుయోగ్యమైన భూమి బీడుభూమిగా మారుతోంది. ఏటా బీడు విస్తీర్ణం పెరుగుతోంది.

20. ఏటా 15 లక్షల నుంచి 25 లక్షల హెక్టార్లు భూమి పాడవు తోంది. నీరు నిల్వ ఉండటం, ఉప్పు లవణాలు పైకి తేలటంతో, భూములు చవుడుబారిపోతున్నాయి. దేశంలో 2కోట్ల ఎకరాల ఉప్పు భూములున్నాయి వాటి పునరుద్ధరణలేదు.

21. ఏటా 15 కోట్ల హెక్టార్ల భూమి, గాలులు నీరు ధాటికి దెబ్బ తింటున్నది. నేలకోతచే భూసారాన్ని కోల్పోతున్నాం. ఏటా 600 కోట్ల టన్నుల సారవంతమైన మట్టి కొట్టుకుపోతున్నది.

22. భూసారం కొట్టుకుపోవడంతో పొలాలు వట్టిపోతున్నాయి. పొలాలందు వేసే పంటలవల్ల, నేలలోని పోషక రసాయనాలు నశిస్తున్నాయి.

---

23. ప్రజలకు ఆహారం, పరిశ్రమలకు ముడిసరకులు అందిస్తూ- నాలుగింట మూడొంతులు జనాభాకి జీవనాధారం అయి- జాతీయాదాయంలో 48శాతాన్ని సమకూరుస్తూ ఉన్న వ్యవసాయంపై ఎంతటి కృషి జరపాలి?

24. పొలాలనుంచి అధిక దిగుబడిని సాధించుకునే పథకాలు, ప్రయత్నము చేయని పార్టీల పాలనవల్ల- అధికంగా ఉత్పత్తులను, ఆదాయాలను దేశపౌరులు కోల్పోయారు. సేద్యపు భూమిని, నీటిని సద్వినియోగ పరచలేని ప్రభుత్వ పాలనవలనే- గ్రామపట్టణ నగరాలంతటా పేద బ్రతుకులు.

25. నీటి పారుదల సౌకర్యంలేని భూములపై, మెట్టపైరులు సాగవుతున్నాయి. నేటికి 70 శాతం భూమి, మెట్ట సేద్యంలోనే ఉంది. వ్యవసాయక వుత్పత్తులలో 40 శాతం పైగా, వర్షాధారం మరియు మెట్ట భూముల నుంచే లభిస్తున్నాయి. మెట్టపంటల దిగుబడి తక్కువగా వుంటున్నా, వుత్పత్తి అధికం కాబడేందుకు, మెట్టసేద్యాన్ని అభివృద్ధిపర్చలేకపోయిన ప్రభుత్వపాలన ఇది.

26. వ్యవసాయరంగంలో సాధించిన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని అధికోత్పత్తి సాధించేందుకు వుపయోగపడేట్లు చేయనందువలననే- సాధారణ సేద్యపు పద్ధతులనే రైతాంగం అవలంభిస్తున్నారు. ఆకారణంగా భూమి అనే వనరు సద్వినియోగ పడటంలేదు.

27. భారతీయులు తమ తిండికోసం దశాబ్దాల క్రిందటి నుంచే, దిగుమతులపై ఆధారపడకుండా స్వయం సమృద్ధిని సాధించుకొని, ఎగుమతులు చేస్తుండాల్సింది. తద్వారా ప్రజల ఆర్థిక సమస్యలు తొలగేవి.

28. దేశ ఆర్థికవ్యవస్థ వ్యవసాయరంగంపై ఆధారపడి ఉన్నప్పుడు, ఎలాంటి ఒడిదుడుకులు ఏర్పడినా తట్టుకునే విధంగా, వ్యవసాయాభివృద్ధి జరగాలి. వివిధరంగాల అభివృద్ధి ఏవ్యవసాయోత్పత్తులపై ఆధారపడి ఉందో: అట్టి వ్యవసాయాన్ని గత 40 సంవత్సరాలుగా నిర్లక్ష్యంచేస్తూ వచ్చిన పార్టీ ప్రభుత్వాలివి.

29. ఆకారణంగానే అభివృద్ధికి బదులు దారిద్ర్యం పెరిగింది.పనులు పెరిగి ఉపాధి లభించటానికి బదులు, నిరుద్యోగం పెరిగింది. జీవన ప్రమాణం పెరగటానికి బదులు తగ్గింది. పేదరికం మరింత వికృత స్వరూపం చెందింది.

30. ఆర్థిక రాజకీయ రంగాలలో స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు బదులు, విదేశీ ఒత్తిళ్ళకు తలఒగ్గాల్సి వచ్చింది. భారతదేశం పేద దేశాలలో ఒకటిగా లెక్కింప బడుతోంది. ఎందుకుఇలాంటి పార్టీలపరిపాలన? వాటిని వదిలించుకొందుకే,

యావత్ భారతీయులపేర నెలకొన్నది మాదేశంపార్టీ.

# 6. జంతు ఉత్పత్తులు

1. జంతు ఆహారోత్పత్తులలో పాలు ఎంతో శ్రేష్టమైనవి. పిల్లలు పెద్దలు రోగగ్రస్థులు జీర్ణశక్తి తగ్గినవారికి; పాలు పెరుగుకి మించిన పోషకాహారం వేరొకటిలేదు.

2. కోడిగ్రుడ్డు బాతుగ్రుడ్డు వేటినైనా, కాయగూరలవలె వాడవచ్చు. రోజుకో గ్రుడ్డుకాకున్నా; వారానికి 4సార్లయినా వాడాలి. గ్రుడ్డులో బి$_{12}$ విటమిన్ లభిస్తుంది. ఇది మాంసం కాలేయంలో తప్ప, ఇతర ఆహారపదార్థాల నుంచి లభించదు.

3. మాంసము చేపలు తినేవారికైనా, అవి అందుబాటులోలభించాలి. శిథిలశరీరం ధారుఢ్యాన్ని పొందటంలో, శక్తిని బలాన్ని పుంజుకోవటంలో, వాటికి మించిన ఆహారంలేదు. అయితే జంతు ఉత్పత్తులు ఎంతో అల్పంగా ఉన్నాయి. ఆకారణంగా అధికధరలతో వేటిని కొనలేకున్నాం.

4. ఈ ప్రభుత్వమే ఒక దళారి. అది రైతుల దగ్గర తక్కువరేటుకి పాలనుకొని, ప్రజలకు పాలు వెన్న నెయ్యిని, ఎక్కువ ధరలకు అమ్ముతున్నది. అయినా పాడిపరిశ్రమ సంస్థలకు నష్టం వస్తోందట.

5. ఏ దేశంలోనూ లేనన్ని పశువులు మనకు ఉన్నా, అవి నాసిరకంవి కావటంచే, అవి ఇచ్చేపాలు తక్కువ. దశాబ్దాలుగా గేదెలపాలపై ఆధారపడేట్లు చేశారేగాని, ఆవులనుంచి ఎక్కువ పాలను పొందే కృషి చేపట్టలేదు. దేశంలోని ఆవులు ఏడాదికి సగటున 175 కిలోల పాలు ఇస్తుండగా, విదేశాలలోని ఆవులు 4వేల కిలోల నుంచి 5వేల కిలోలవరకు ఇస్తున్నాయి.

6. రైతులు సంకరజాతి గేదెలు ఆవులతో, ఎక్కువ పాలదిగుబడిని సాధించటంలో-కృత్రిమ గర్భధారణ కేంద్రాల ద్వారా, మేలైన

సంతతిని పొందటంలో—పశువులకు పుష్టికర ఆహారాన్ని న్యాయమైన ధరలకు పొందటంలో, ఈ ప్రభుత్వం రైతాంగానికి ఏమి ఉపకరించింది?

7. భూములన్నీ సేద్యం క్రిందనో, నివాసస్థలాల క్రిందనో ఉండ టంవల్ల; పశుగ్రాసం ఉత్పత్తికి భూములేలేవు. పశువులకు మేత దొరకటమే కష్టంగా ఉంది.

8. పశువుల ఆస్పత్రులు తగినన్ని లేనందువల్ల - ఉన్నవాటిల్లో సౌకర్యాలు లోపించి నందువల్ల-తగిన చికిత్స లభించక - పశువులుకోళ్ళు గొర్రెలు రోగాలచే మరణిస్తున్నాయి. ప్రమాదకర జబ్బులకు ఆస్పత్రు లలో మందులే ఉండవు. డాక్టర్లు సిబ్బంది సైతం శ్రద్ధ వహించటంలేదు.

9. పాడి పరిశ్రమ అభివృద్ధినే సాధించలేని ఈ ప్రభుత్వం; చేపలు మాంసం పెంపుదలకై ఇంకేమి చేయగలదు? జంతువుల పెంపకం వాటి అభివృద్ధి, గాలివాటంగా వదిలివేయ బడ్డది తప్పితే; ఈ ప్రభుత్వాలు వాటిగూర్చి ప్రత్యేకశ్రద్ధ వహింపలేదు. ఆకారణంగా పాలు గ్రుడ్లు చేపలు మాంసం వంటివి కొనేందుకు, అందుబాటులో లేకుండా పోయాయి. పాలు పెరుగు సైతం వాడలేని పరిస్థితి నెలకొంది.

10. జంతువుల పెంపకాన్ని యంత్రాలద్వారా జరపకలిగే విధంగా, అభివృద్ధి చెందిన దేశాలలోని రైతాంగం-అక్కడి ప్రజలకు అవసరమైన జంతు ఉత్పత్తులకన్నా, ఎక్కువగా మరింత ఎక్కువగా ఉత్పత్తిచేస్తు న్నారు. ఆకారణంగా అక్కడి ప్రభుత్వాలు, లక్షలాది టన్నుల ఉత్పత్తుల నిల్వలను-ఎవరికి ఎగుమతి చేయాలా, ఎలా వదిలించుకొనాలా అని సతమత మవుతున్నాయి. మరి ఈదేశ ప్రభుత్వం ఏమో; జంతువుల పెంపకం పోషణపై శ్రద్ధ వహించకుండా, పథకరీత్యా ఆహారోత్పత్తిని పెంచ కుండా, దశాబ్దాలుగా నిర్లక్ష్యం చేసింది. అట్టి ప్రభుత్వాన్ని,

తొలగించుకొంటుకే మాదేశం పార్టీ.



# 7. నీటిపారుదల

1. ఏ నీటికోసం జీవరాశి యావత్తూ తపియిస్తున్నదో, ఏ నీరు లేనిదే పశువుల పైరుల జీవితంలేదో, ఏ నీరులేనిదే పరిశ్రమలన్నీ ఆగిపోతాయో; అట్టి విలువైన నీటిని నిల్వచేసేందుకు, గత 4 దశాబ్దాల దీర్ఘకాలం ఈపార్టీ ప్రభుత్వాలకు చాలలేదు.

2. వర్షాధార సేద్యంనుంచి విముక్తి కలగకుండా, రైతాంగం కష్టాలు తొలగకుండా, అభివృద్ధికి నోచుకోనివ్వకుండా, అడ్డుకుంటున్న ప్రభుత్వాలివి.

3. నీటిపారుదలకు చేపట్టిన డామ్‌లు రిజర్వాయర్లు కాలువల నిర్మాణం, ఆయకట్టు అభివృద్ధిని, త్వరత్వరగా పూర్తిచేయాల్సినది లేకపోగా విపరీత జాప్యం చేస్తూ- ఏయేటా నీటిసాగులోకి భూమిని రానివ్వకుండా, ఆహారోత్పత్తి పెంపొందకుండా, ప్రాజెక్టుల ఫలితాలు ప్రజలకు అందకుండా, చేస్తున్న ప్రభుత్వాలివి.

4. సరికొత్త ప్రాజెక్టుల నిర్మాణంతో గ్రామసీమలకంత్తా నీటిని పారించవల్సింది పోయి, గతకాలం నాటివి పూర్తయ్యేందుకే, ఇంకా దశాబ్దాలు పట్టేట్లుందేమి?

5. ప్రాజెక్టుల నిర్మాణంలో పథకాలు రూపొందించడంలో, చిన్న నీటి వనరులను చేపట్టడంలో; రాజకీయవాదుల జోక్యం ఆశ్రిత పక్షపాతం అధికార దుర్వినియోగం లేకుండా విధంగా పరిపాలనలేదు. శాస్త్రీయమైన సాంకేతికపరమైన నిర్ణయాలు అమలు జరగటంలేదు. ఆకారణంగా ఎంతో దుర్వ్యయం ఎన్నో నష్టాలు.

6. ప్రాజెక్టుల నిర్వహణ సరిగ్గాలేదు. నీటిపారుదల ఏర్పాట్లు శాస్త్రీయంగా లేవు. అందుచే ప్రాజెక్టు నీటిలో దాదాపు సగం వృధా అయిపోతు

న్నది. నీరు ఇంకిపోని రీతిలో కాలువలకు లైనింగ్ లేదు. పంటకాలువలచే ఎగువదిగువ రైతులందరికి ప్రయోజనం కలిగేట్టు నీరు అందటంలేదు. మరమ్మత్తు పనుల లోపముచే, ఒకచోట పైరులకు నీరు అందదు. వేరొక చోట పొలాలలోకి నీరు చేరుతుంది. మరోచోట నీరు వృథాగా మురుగు కాల్వలలోకి వదల బడుతుంది. పంటల చివర నీటి ఎద్దడి.

7. పంటకాల్వలు మురుగుకాల్వలు చెరువుల మరమ్మత్తులు, నదులలో జలాశయాలలో ఇసకమేటల తొలగింపు, వంటి పనులను నిర్లక్ష్యం చేస్తున్న ప్రభుత్వాలచే, వరదనీరు పోయేందుకు అడ్డంకి ఏర్పడుతోంది. మురుగునీటి పారుదల సక్రమంగా లేనందుచే, ఏటా పంటలు పశుగ్రాసం నీటిలో మునిగి నాశనం అవుతున్నాయి.

8. నీటిపారుదలకు ఆటంకంగా ఉండే; కలుపుమొక్కలు, చెట్లు, పూడిక, తొలగించటం చేయరు. చెరువులకు కాలువలకు గండ్లుపడి, కలిగే నష్టం నివారింపబడటం లేదు. బీడుబారి, ఇసుక మేటలువేసి, నీరునిల్చి, పాడవుతున్న భూములలా వదిలివేయబడ్డాయి.

9. చిన్నచిన్న నదుల నీటిని, వరదనీటిని, భూగర్భజలను, వినియోగపడేట్లు చేసే పథకాలపై నిర్లక్ష్యం వహించారు. సత్వర ఫలితాలను అందించే, చిన్న ప్రాజెక్టులపై తగిన కృషిలేదు. పార్టీల ప్రభుత్వాలు నదీజలాలపై వివాదాలు పడుతూ, సమస్యలను పెంచుతూ, నదుల నీటిని సముద్రాల పాల్జేస్తున్నారు.

10. నేటికి 70శాతం గ్రామాలకు రక్షిత మంచినీటి సౌకర్యం కల్పించబడలేదు. అనేక పట్టణాలకు పరిశుభ్రమైన నీటి సరఫరాలేదు. కలుషితమైన నీటిచే, ఎందరికో ఎన్నో వ్యాధులు కల్గుతున్నాయి. ఫ్లోరైడ్ నీటిచే అంగవైకల్యము కల్గుతోంది.

11. మంచినీటికోసం మండుటెండల్లో మైళ్ళకొద్దీ పోవటం, ఊట నీటికోసం పడిగాపులు, గంటలకొద్దీ కొళాయిలవద్ద పడిగాపులు, త్రాగేనీటికే దురవస్థ. నీరు మంచినీరు అని తపియించే గ్రామ ప్రాంతాలెన్నో? పట్టణ ప్రాంతాలెన్నో? ఏమి పాలన ఇది?

12. దశాబ్దాలుగా త్రాగేనీటికి కూడా కరువు. గ్రుక్కెడు నీళ్ళ కోసం ఆరాటం ఆవేదన. ఏమి అభివృద్ధి ఇది?

13. వరదలు క్షామం ప్రకృతి వైపరీత్యాలు కాదు. స్వయంకృతాపరాధాలు. వరద అంతా వర్షపునీరు. ఎక్కువ వర్షంచే పడిన ఎక్కువనీరు పోయేందుకు నదులమార్గం పట్టక, నదుల కట్టలపై నుంచి నీరుపారి, చుట్టు ప్రక్కల ప్రాంతాలు మునుగుతున్నాయి.

14. పెద్దకాలువలు మురుగుకాల్వలు చెరువులు ఏరులు వాగులు చిన్నచిన్న నదులు మొదలగువాటి కట్టలు తెంచుకొని, వరదనీరు చుట్టు ప్రక్కల పొలాలను ముంచెత్తుతుంటే, ఆ కష్టనష్టాలు ఎవరివి?

15. వరదలుచే మనుష్యుల పశువుల ప్రాణాలకు, ఆస్తులకు, పైరులు పంటలకు, పొలాలకు, సరకులకు, చిన్ననీటి వనరులకు, రహదారులకు, రైలుమార్గాలకు, కమ్యూనికేషన్లకు, విద్యుత్ ప్రసారానికి, రాకపోకలకు మొదలగు వాటన్నింటికి ఎన్నో నష్టాలు. ఎన్నో ఆటంకాలు ఎందరికో కష్టాలు. ఎందరికో దుఃఖము.

16. వర్షాలులేక తీవ్రదుర్భిక్షం. పైరులు ఎండిపోతాయి. నీటి వనరులలో నీరే ఉండదు. నేలలు బీటలు వారతాయి. అంతటా బక్కచిక్కి శల్యమైపోతున్న పిల్లలు పెద్దలు. ఆకలిచావులు. పశువుల మరణాలు. నీరు లేక తిండికరువై, ఇళ్ళు పొలాలను వదిలి, దిక్కులేని వారలై ఎక్కడికో వలస. ఏమిటీ దుర్భర పరిస్థితులు క్షామప్రాంతాలలో?

17. వరదలు కరవుకాటకాల బెడదను శాశ్వతంగా నిర్మూలించే,

ఎన్నో పథకాలను ఎందరో నిపుణులు ఈ ప్రభుత్వాలముందు ఉంచగా, ఆ పథకాల అమలుపై గట్టికృషి చేయకుండా, ప్రజలను వరదలకరవుకాటకాల దుష్ఫలితాలకు ప్రతిఏటా బలి చేస్తున్నవి. ఎందుకు ఈ పార్టీల ప్రభుత్వాలు. ఇవి ఇంకెంత మాత్రం పరిపాలించటానికి తగవు.

18. అతివృష్టిచే వరదలు ఎందుకు?
అనావృష్టిచే క్షామం ఎందుకు?

వ్యవసాయోత్పత్తుల కొరతలు అధిక ధరలు ఏల? ఆ దుష్ఫలితాల బారినుంచి శాశ్వతంగా విముక్తి చెందేందుకే మాదేశంపార్టీ. పౌరులంతా ఏకమై ముక్త కంఠంతో,

మాదేశంపార్టీ స్వీకరణ నినాదాన్ని, ప్రతిధ్వనింపజేయండి.

# 8. పరిశ్రమలు

1. దేశ అవసరాలు వనరులు బట్టి పరిశ్రమలు నెలకొన్నాయా? లేదు. పరిశ్రమల స్థాపనలో పరిగణనలోకి తీసుకోనాల్సిన నిర్దిష్టమైన అంశాలు, సహజ వనరుల పరిశీలన వదిలివేయబడ్డాయి. పరిశ్రమల ప్రాజెక్టుల స్థాపనలో అనువైన ప్రాంతాలు ఏవో అచ్చట కాకుండా, ప్రలోభాలు లాలూచీలు, పక్షపాతం, రాజకీయం వంటి దుర్లక్షణాలు చోటు చేసుకున్నాయి.

2. కొత్తగా పరిశ్రమలు నెలకొల్పేందుకు ప్రభుత్వ కార్యాలయాల చుట్టూ అధికారవర్గం చుట్టూ తిరుగుతూ, అందుకు ఎన్నో దరఖాస్తులు పెట్టుకొని, సర్టిఫికెట్లు తెచ్చుకొని, అనుమతులు సంపాందించటం, ఎన్నో వ్యయప్రయాసలతో కూడి ఉంటోంది.

3. పరిశ్రమలకు కావల్సిన స్థలము పొందటంలో, బ్యాంకులనుంచి అప్పులు పొందటంలో, యంత్ర సామాగ్రిని సమకూర్చుకొనటంలో, విద్యుత్ టెలిఫోన్ కనెక్షన్లు, నీటి సరఫరా మురుగుకాలువల ఏర్పాటు, రోడ్లు రవాణా తదితర సదుపాయలు పొందటంలో, పారిశ్రామికులు ఎన్నో కష్టాలకు గురవుతున్నారు.

4. పారిశ్రామిక అభివృద్ధి చెందిన ప్రాంతాలలోనే, మరింతగా పరిశ్రమలు నెలకొంటున్నాయి. పరిశ్రమలలో 70 శాతం నగరాలు పట్టణాలందే కేంద్రీకరించ బడ్డాయి. వ్యవసాయ పరిశ్రమల అభివృద్ధిసైతం, గ్రామప్రాంతాలలోగాక పట్టణాలందే జరగటంచే, గ్రామపట్టణ ప్రాంతాల మధ్య వ్యత్యాసాలు పెంచబడ్డాయి.

5. పారిశ్రామికంగా; కొన్ని రాష్ట్రాలు రాష్ట్రాలలోని కొన్ని జిల్లాలు వెనుకబడ్డాయి. వెనుకబడిన ప్రాంతాలు వెనుకబడ్డవిగానే ఉండటంచే, అచ్చటివారి జీవనప్రమాణం పెరగలేదు. పారిశ్రామికంగా అభివృద్ధికి అవకాశంగల ప్రాంతాలు నిర్లక్ష్యం చేయబడ్డాయి.

6. పరిశ్రమల ఏర్పాటుకు శంఖుస్థాపనలు జరిపి, ఏవో కొద్దిపనులు జరిపి, నిర్మాణం పనులకు నిధులుకేటాయించక పోవటం-ఒకచోట నిర్మింప తలపెట్టిన వాటిని, మరల వేరొక ప్రాంతానికి తరలించటం-పరిశ్రమల స్థాపితశక్తిని కుదించివేయడం-దురన్యాయాలకు పాల్పడటం వంటివి చేస్తున్న ప్రభుత్వం ఇది.

7. స్థానికులకు పనులు దొరికేరీతిలో, ఉత్పత్తి ఖర్చు తగ్గేరీతిలో, పరిశ్రమలు నెలకొనలేదు. వ్యవసాయేతర పనులపై ఆధారపడిబ్రతికేందుకు వీలుగా, పారిశ్రామిక వికేంద్రీకరణ జరగలేదు. ఆకారణంగా పారిశ్రామిక అసమానత నెలకొంది. అభివృద్ధిలో అసమతవుల్యం ఏర్పడింది.

8. సాధారణ ప్రజ వినియోగ వస్తువుల పరిశ్రమలకన్నా, విలాస వస్తువులు పెట్టుబడి వస్తువుల పరిశ్రమలకే ప్రాధాన్యం ఇవ్వబడి నందువల్ల, కోట్లాది ప్రజల సంక్షేమానికి ఉపయోగపడాల్సిన పెట్టుబడులు వ్యర్థమయ్యాయి.



9. ప్రజల ప్రయోజనాలకు అనువుగా ఉత్పత్తి జరుగుతోందా? లేదు. సహజవనరులు, కార్మికులు, సాంకేతికులు, పెట్టుబడి ఉన్నా; అంతర్జాతీయ ప్రమాణాలకు తగ్గట్టు ఉత్పత్తులను సాధింపలేదు. ప్రజలకు వీలైనంత చౌకగా, వీలైనంత నాణ్యత కలవిగా, మరింత ఆధునికంగా, మరింత నిరపాయకరంగా, లభించే రీతిలో వస్తూత్పత్తి లేదు.

10. ఉత్పత్తులలో నాణ్యతను పెంచే సౌకర్యాలు, సాంకేతికులు ప్రయోగశాలలు లేనట్టి ఉత్పత్తిదార్లవల్ల; నాణ్యతలేని ముడిసరకులు, ఉత్పత్తులే లభిస్తున్నాయి.

11. ఒకే రకం వస్తువుల ఉత్పత్తి ఎక్కువ కావటం, కొన్ని

రకాల వస్తువులకు కొరత ఉండటం ఉంటోంది. దేశావసరాలు పెరిగిన రీతిలో వస్తువులను వాడుకలోకి తేలేదు.

12. నకిలీ నాసిరకం కల్తీ వస్తూత్పత్తి తయారై అమ్ముడవటం- మభ్యపుచ్చి మోసపుచ్చే వ్యాపార ప్రకటనలు అమ్మకాలు నుంచి-కొనుగోలుదార్లకు రక్షణ లేకుండా ఉంది. విలాస వస్తూత్పత్తి, విలాసపూరిత ఖర్చు, డాబూదర్పం విజృంభించింది.

13 ఉత్పత్తిపై ధరలపై, నిర్బంధాలు అదుపు వంటివి కంట్రోళ్ళు పాలకపక్ష కంట్రోళ్ళు ఉత్పత్తిని దెబ్బతీశాయి. కొరతల నేర్పరచాయి. బ్లాక్‌మార్కెట్ సరకుల దాచివేత కొనసాగాయి. ఒకే వస్తువుకి చౌక దుకాణాలలో ఒకధర, స్వేచ్ఛామార్కెట్‌లో ఒకధరపెట్టి, చివరకు కొనుగోలుదార్లనే నష్టపరచారు. మార్కెట్లో వస్తువుల అమ్మకాలకి పోటీలేక పోయింది.

14. పారిశ్రామికులు తమ పరిశ్రమలద్వారా, తాము తయారుచేసే ఉత్పత్తుల ద్వారా; ప్రజలను వంచించే కొల్లగొట్టే విధానం అనుమతించబడుతోంది.

## చిన్న పరిశ్రమలు

15. చిన్న పరిశ్రమలందు; సైకిళ్ళు రేడియోలు వాచీలు డీసెలు ఇంజన్లు, పరిశ్రమల కవసరమయ్యే విడిభాగాలు, ఎలక్ట్రానిక్ పరికరాలు, ఇలా ఎన్నోరకాల వస్తువులను తయారు చేస్తున్నారు.

16. పారిశ్రామిక ఉత్పత్తిలో సగభాగం, చిన్న పరిశ్రమల నుంచే వీలవుతున్నది. దేశంలో సుమారు 14 లక్షలదాకా చిన్న పరిశ్రమలు ఉన్నాయి. మొత్తం ఎగుమతులలో చిన్న పరిశ్రమల వాటా 22శాతందాకా ఉంది.

17. చిన్న పరిశ్రమలు దెబ్బతినేరీతిలో, పెద్ద పరిశ్రమలకు ప్రాధాన్యత ఇవ్వబడింది. పారిశ్రామిక ప్రగతికి ఉపాధికి తోడ్పడుతున్న, చిన్న పరిశ్రమల అవసరాలను గుర్తించి, వాటి అభివృద్ధికి తోడ్పడలేదు.

## మూతపడ్డ పరిశ్రమలు

18. ముడి సరకులు సకాలంలో లభించకపోవటంచేగాని 2) పెట్టుబడి కొరతవల్లగాని 3) తయారీ వస్తువులకు మార్కెట్లో గిరాకీ లేకగాని 4) అమ్మిన వస్తువుల వసూళ్ళు ఆలస్యమవటంవల్లగాని 5) ఉత్పత్తి చేయలేక 6) పెరిగిన ఉత్పత్తి ఖర్చువల్ల 7) వడ్డీలు అసలు వాయిదాలు చెల్లింపలేక 8) పాతయంత్రాలవల్ల 9) సాంకేతిక లోపంవల్ల 10) సాంకేతిక నిపుణులను పొందలేక పోవటంవల్ల 11) యజమాన్య నిర్వహణా లోపాలువల్ల, మొదలగు కారణాలచే ఆర్థికంగా ఇబ్బందులకు నష్టాలకు గురయి, చిన్నాపెద్దా పరిశ్రమలు ఎన్నో మూతపడ్డాయి.

19. చిన్న పరిశ్రమలలో మూతపడ్డ వాటి సంఖ్యా లక్ష 28 వేలు వాటిల్లో 1184 కోట్ల పెట్టుబడి ఇరుక్కొనిపోయి ఉంది.

20. దేశంలో మూతపడ్డ చిన్నపెద్ద పరిశ్రమల సంఖ్య దాదాపు లక్ష 80 వేలు. అవి బ్యాంకులనుంచి ఆర్థిక సంస్థలనుంచి పొందిన అప్పులో వేల కోట్లు తీర్చకుండా బకాయి పడ్డాయి. ఆమేర వాటిపై పెట్టుబడివృధాగా పడి ఉంది. మరోప్రక్క ఆర్థిక అభివృద్ధికి కీలకమైన ఉత్పత్తి జరపకుండా ఆ పరిశ్రమలు వృధాగా పడిఉన్నట్లు. వాటిచే నిరుద్యోగం ప్రబలింది. వాటిపై ఆధారపడ్డ అనుబంధ పరిశ్రమలు తెబ్బతిన్నాయి.

21. పారిశ్రామిక సమస్యలు పెరగటమేకాని, అవి పరిష్కరింపబడే విధానంలేదు. దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధిపర్చే రీతిలో, దేశ ఆర్థిక వ్యవస్థను పటిష్టపరచే రీతిలో, విదేశీ మార్కెట్‌లో పోటీని తట్టు

కునే రీతిలో; పరిశ్రమలు పనిచేయటంలేదు. పరిశ్రమలు పనిచేసే విధానంలో, సాంకేతికంగా అభివృద్ధిలేదు. నాసిరకం తయారీ నిలిచిపోలేదు. ముడిసరకుల వినియోగంలో దుబారా అరికట్ట బడలేదు.

22. కొన్ని పరిశ్రమలందు ఉత్పత్తి లాభసాటిగా లేకుంది. ఇంధన సమస్యలు, ముడిసరకుల సమస్యలు, రవాణా సమస్యలు, మార్కెట్ సమస్యలు మొదలగువాటిని; పరిశ్రమలు ఎదుర్కొనటంచే ఉత్పత్తితగ్గిపోతున్నది.

23. బొగ్గువిద్యుత్ ఉక్కు పెట్రోలియం వంటివాటి సరఫరా-రవాణా కమ్యూనికేషన్ల సదుపాయాలు - ముడిసరకులు విడిభాగాలు లభించుట-సాంకేతిక పరిజ్ఞానంయొక్క అందుబాటు మొదలగు వాటిల్లోగల లోపాలచే ఉత్పత్తి ఖర్చు పెరుగుతోంది.

24. ఉత్పత్తి వ్యయాన్ని తగ్గించి, వస్తువులను చౌకలో లభింపజేయటంలేదు. కాలదోషం పట్టిన సాంకేతికత స్థానే, ఆధునికతను ప్రవేశపెట్టుకోలేకున్నారు. ఉత్పాదకశక్తిని సరిగా ఉపయోగించుకొనుటలేదు. ఆ కారణంగా ప్రజలేమో ఎక్కువధర చెల్లించి, వస్తువులను కొనుక్కోవల్సి ఉంటున్నది. మరోప్రక్క నాణ్యతకలవి కానందుచే మోసపోవల్సి వస్తున్నది.

25. దేశంలో తయారయ్యే వస్తువులన్నీ, జనాభాలో ఏ పదిశాతమో 20 శాతమో కొరకే. మిగతా 80 శాతం ప్రజ, కొనుగోలుశక్తి లేనివారే. ఆకారణంగా కూడా స్వదేశీ మార్కెట్ విస్తరించటం లేదు.

26. సహజ వనరుల వినియోగంలోను, సాదారణ ప్రజల వాడకం వస్తువులకు కొరతలేకుండాను, నిరుద్యోగం పరిష్కరింపబడే రీతిలోను, పారిశ్రామిక సమస్యలు తలెత్తని రీతిలోను; పారిశ్రామికంగా అభివృద్ధిని సాధించలేని పార్టీ ప్రభుత్వాలివి. ఇట్టి పాలనా వైఫల్యాల నుంచి విముక్తికే,

పౌరులంతా మాదేశం పార్టీని స్వీకరించండి

# ౬. ప్రభుత్వ రంగం

1. ప్రభుత్వపరంగా ఉత్పత్తి సేవా కార్యకలాపాలు అందించేందుకు- పరిశ్రమలు, గనులు, విద్యుత్, రవాణా, నిర్మాణం, వ్యాపారం, బ్యాంకులు, భీమా, మొదలగు వాటికి చెందిన ఎన్నో సంస్థలు నెలకొల్పబడి- ప్రభుత్వ అధీనంలో పని చేస్తున్నాయి. వాటిని ప్రభుత్వ రంగంగా లేదా ప్రభుత్వ సంస్థలుగా పిలుస్తున్నాం. వాటికి కావాల్సిన పెట్టుబడి, ప్రభుత్వంచే సమకూర్చబడింది. వాటిపై ఆదాయము ప్రభుత్వమునకే చెందుతున్నది.

2. ప్రభుత్వరంగంలో కేంద్రప్రభుత్వంయొక్క పెట్టుబడి, 50వేల కోట్లు దాకా ఉంది. రాష్ట్రప్రభుత్వాల యొక్క పెట్టుబడి మరో 50వేల కోట్లు దాకాఉంది. వాటిపై పెట్టిన పెట్టుబడులు ప్రజలవిగాని, ప్రభుత్వానికి ఎక్కడివి? వాటి యజమాన్యం ప్రజలుకాని ప్రభుత్వం కాదు. అయినప్పటికి అవి ప్రభుత్వ గుత్తాధికారం క్రింద ఉంచుకోబడ్డాయి. ప్రభుత్వ సంస్థలు అనేవి, ప్రజాసంస్థలుకదా.

3. ప్రభుత్వ సంస్థలు ఆర్థికాభివృద్ధికి దోహదపడాల్సింది పోయి, అభివృద్ధికి అవరోధంగా పరిణమిస్తున్నాయి. ప్రభుత్వ సంస్థలు నష్టాలతో నడుస్తూ క్షీణించి పోతున్నాయి.

4. ప్రభుత్వ పరిశ్రమలలో సగభాగం, వాటి ఉత్పాదక శక్తిలో 50 శాతం కన్నా, తక్కువగా పని చేస్తున్నాయి. విద్యుత్ ఉత్పాదనలో 40 శాతమే వినియోగించుకో బడుతోంది. ప్రభుత్వం నడిపే పరిశ్రమలలో ఉత్పాదకత పెరగటంలేదు. ఉత్పాదక స్థాయిని ఉపయోగించుకొనుట చేత కావటంలేదు, ఉత్పత్తులలో నాణ్యత పెరగటంలేదు. అంతేగాక ఉత్పత్తి ఖర్చు ఎక్కువ అవటంచే, వివిధ వస్తువుల ధరలు ఎక్కువగా నిర్ణయించబడుతున్నాయి.

5. ప్రవేటు పరిశ్రమలు సంస్థలు లాభాలతో నడుస్తుంటే: కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు నడిపే పరిశ్రమలు సంస్థలు, ఏటా నష్టాలతో నడుస్తున్నాయి. నష్టాలు లేకుండా నడిచేవి ఏ కొద్దో. ప్రభుత్వ నిర్వహణలోని కొన్ని సంస్థలు లాభాలు ఆర్జిస్తున్నాయంటే; అదంతా ప్రజలను కొల్లగొట్టి రాబట్టుకుంటున్న లాభాలవి. సమర్థతతో నడిపితే కదా, లాభాలు వచ్చేది. ఆ నిర్వహణా సామర్థ్యం ప్రభుత్వానికి లేనప్పుడు; ఇక ఆ ప్రభుత్వ సంస్థలు నష్టాలతోకాక లాభాలతో నడుస్తాయా?

6. ప్రభుత్వంచే నిర్వహింపబడే పరిశ్రమలు సంస్థలు కల్గించే భారీ నష్టాలను; ఎక్కువధరలు, ఎక్కువ చార్జీలు, ఎక్కువ పన్నులు చెల్లించటం ద్వారా, ప్రజలే భరించాల్సి వస్తున్నది.

7. పెట్రోలియం ఉత్పత్తుల ధరలు, ఎరువులు ఇనుము ఉక్కు బొగ్గు సిమెంటు మొదలగు వాటన్నింటి ధరలు, రైల్వేలు బస్సులు తంతి తపాలా చార్జీలు, పెంచివేయ బడుతున్నాయి. అంతేగాక రైల్వేలు బస్సులు ఓడరేవులు కమ్యూనికేషన్లు విద్యుత్ ఇంధనం గనులు వ్యాపారసంస్థలు వంటివాటి నిర్వహణ సరిగాలేక; ప్రజలకు ఎన్నో ఇబ్బందులు కల్గుతున్నాయి.

8. విద్యుత్ ఉత్పత్తివల్ల నష్టాలు, ఇనుము ఉక్కు తయారీవల్ల నష్టాలు, బొగ్గు గనులపై నష్టాలు, జవుళి మిల్లులపై నష్టాలు, రైల్వేలు బస్సులు నడపటంచే నష్టాలు, ఇలా ఎన్నో నష్టాలపైనే నడుస్తున్నాయి. 1985లో ఈ నష్టాలు 4వేల 835కోట్లు. 1986లో ఈ నష్టాలు 6వేల 753కోట్లు.

9. ప్రభుత్వరంగం ద్వారా, విదేశీ స్వదేశీ కంపెనీలు అపారమైన లాభాలను ఆర్జించడానికే; ఈ ప్రభుత్వము తోడ్పడింది.

10. ప్రభుత్వ సంస్థలలో, తప్పుడు పద్ధతులు అక్రమాలు లోసు

గులు పెరిగాయి. నిరంకుశ అధికారుల పెత్తనం పెరిగింది. ప్రభుత్వ సంస్థల టెండర్ల మంజూరులో, ఉత్పత్తి అయిన వస్తువుల అమ్మకంలో, అవినీతి ప్రబలంగా ఉంది. అధికార దుర్వినియోగానికి అవినీతికర కార్యకలాపాలకి అలవడ్డారు.

11. ఇక అక్కడి ఉద్యోగ నియామకాలన్నీ, పైరవీల ద్వారానే జరుగుతుంటాయి. గుమ్మస్తాలు అధికార్లు డైరక్టర్లు సెక్రటరీలు అంతా, బాధ్యతా రహితంగా ప్రవర్తించేవారే. సామర్థ్యంలేని సాంకేతిక నిపుణత లేని, కార్యనిర్వహణాధికారులు వారు.

12. అవసరాలకు మించిన ఉద్యోగుల నియామకంతో, అనవసర సిబ్బంది పెరిగింది. వారి జీతభత్యాలు పెరిగిపోతున్నాయి. వారికి సౌకర్యాల పేర ఎంతో ఖర్చు అవుతోంది. కార్మికుల సమ్మెలు, లాకౌట్లతో, పని స్తంభించి పోతున్నది.

13. ప్రభుత్వ సంస్థలు; మంత్రి పదవులు దొరకని రాజకీయ వాదులకు పదవులు కట్టబెట్టేందుకు- లంచాలద్వారా పెద్దఎత్తున డబ్బు సంపాదించేందుకు- రాజకీయవాదుల బంధుమిత్రులకు ఉద్యోగాలు కంట్రాక్టులు ఇప్పించేందుకు- ఉపయోగించు కోబడుతున్నాయి.

14. రాజకీయ పెత్తందార్ల అనవసర జోక్యం చోటు చేసుకొంది. వారి చెప్పుచేతల్లో నడిపించుకో బడుతున్నాయి. అనవసర ఖర్చులతో, దుబారా ఖర్చులతో, నిర్వహణా లోపాలతో, ప్రజాధనం దుర్వినియోగమవుతోంది.

15. ప్రభుత్వ సంస్థలకు సంభవిస్తున్న నష్టాలను తొలగించే శక్తి కాని, వాటి నిర్వహణలోగల లోపాలను తొలగించే శక్తిగాని, ఈ పార్టీ ప్రభుత్వాలకు లేదు. అందుకు గత పాలనంతా సాక్ష్యమే. నేడైనా కళ్ళు తెరచి వివేకోదయంతో,

తమదైన పార్టీ మాదేశంను ఇంటింటా స్వీకరించండి.

# 16. విదేశీ పెట్టుబడి

1. దేశంలోకి విదేశీ పెట్టుబడి వచ్చి చేరే అంశాలలో ఈ క్రిందివి ముఖ్యమైనవి. 1) విదేశాలనుంచి ప్రభుత్వం తెచ్చే అప్పు 2) ప్రయివేటు కంపెనీలు తెచ్చే అప్పు 3) పరిశ్రమల స్థాపనలో పెట్టే పెట్టుబడి 4) విదేశీ బ్యాంకులలోని విదేశీడబ్బు 5) ఆయుధాల కొనుగోలుకు చేసే అప్పు మొదలగునవి.

2. విదేశీ పెట్టుబడిపై ప్రభుత్వము పరిశ్రమలు ఆధారపడటం పెరుగుతోందేకాని, తగ్గటంలేదు.

3. విదేశీ కంపెనీలు సంపన్న దేశాలకు చెందిన పెట్టుబడిదార్లవి. విదేశీ పెట్టుబడిదార్లు అంటే విదేశీ ఉత్పత్తిదార్లు. విదేశీ కంపెనీలుగా పిలవబడేవి, బహుళజాతి కంపెనీలు. అవి అంతర్జాతీయ గుత్తసంస్థలు.

4. విదేశీ కంపెనీలు స్వంతంగా పరిశ్రమలను నెలకొల్పటంగాక; మన దేశంలోని కంపెనీలతో కలసి, పరిశ్రమలను ఏర్పాటు చేశాయి. అలా పరిశ్రమలలోకి విదేశీ పెట్టుబడి చేరింది. పరిశ్రమలలో భాగస్వామ్యాన్ని పొందాయి.

5. దేశ పారిశ్రామిక ఉత్పత్తికి సంబంధించిన నిర్ణయాలను-స్వతంత్రంగా తీసుకొనలేని పరాధీన స్థితిలోకి- విదేశీ పెట్టుబడి మనలను బంధించింది.

6. విదేశీ పెట్టుబడిని, విదేశీ పెట్టుబడి దార్లను, భారతదేశంలోకి రప్పించి; దేశ వనరులను కొల్లగొట్టి కొనిపోయేందుకు అవకాశం కల్గించబడింది.

7. పారిశ్రామిక అభివృద్ధిపేర ఈ ప్రభుత్వం; బడ్జెట్టులో నుంచి పెట్టుబడిని, గుత్తసంస్థలకు అందిస్తున్నది. తక్కువ వడ్డీకి అప్పులు ఇవ్వడం ద్వారా- సబ్సిడీలు ఇవ్వడంద్వారా- సరకులు కొనడం అమ్మడంలో

లాభాలకు హామీ ఇవ్వటం ద్వారా- ప్రభుత్వరంగం నుంచి వస్తువులను చౌకగా అందించటం ద్వారా, ఇలా వివిధ రూపాలలో తోడ్పడుతున్నది.

8. విదేశీ పెట్టుబడులతో, విదేశీ ఒప్పందాలతో కూడిన, పరాధీన పారిశ్రామిక వ్యవస్థ మనది. మన స్వంత పరిశ్రమలు, మన స్వంత ఉత్పత్తి అని చెప్పుకొందుకు వీలులేని, పారిశ్రామిక అభివృద్ధి మనది. మనం కొనే వస్తువులు, వాడే పరికరాలు, యంత్రాలు, విదేశీ కంపెనీల భాగస్వామ్యంకల, పరిశ్రమలనుంచి తయారయ్యేవి.

9. పెట్టుబడులు, ముడిసరుకులు, విడిభాగాలు, యంత్రసామాగ్రి, సాంకేతిక పరిజ్ఞానంకు - విదేశాలపై విదేశీ కంపెనీలపై ఆధారపడి పని చేస్తున్న పరిశ్రమలు మనవి కావటంచే, పై వాటిని మనదేశంలోకి దిగుమతి చేసుకోవల్సి వస్తున్నవి. దిగుమతుల కొరకై విదేశాల దయాధర్మంపై ఆధారపడిన పరాధీనత నెలకొంది.

10. దిగుమతులపై ఆధారపడనవసరంలేని వినియోగ వస్తువుల ఉత్పత్తి, సదుపాయాల ఉత్పత్తి లేదు. ఆకారణంగా అవి దిగుమతులను, అనివార్యం చేస్తున్న పరిశ్రమలుగా ఉన్నాయి.

11. 5 కోట్లకుపై పెట్టుబడితో, విదేశీ సహకారం లేకుండానడిచే, కొత్తకంపెనీ ఏదీ దేశంలో లేదు.

12. విదేశీ ఆర్థిక, సాంకేతిక సహకారం లేనిదే; పెద్ద పరిశ్రమగాని, కొత్త ఉత్పత్తితో కూడిన పరిశ్రమగాని, ఏదీ నిర్మించుకోలేని పారిశ్రామికరంగం మన్నది.

13. పరిశ్రమలలో వాణిజ్యంలో, స్వదేశీ విదేశీ గుత్తాధిపత్యం నెలకొంది. విదేశీ స్వదేశీ కంపెనీలు కలసి, దేశంలోని కొనుగోలుదార్లను దోపిడీ చేస్తున్నారు. దేశంలోని ఉత్పత్తిపై, ధరలపై, నిర్వహణపై,

ఎగుమతులు దిగుమతులపై, విదేశీ ఆధిపత్యం కొనసాగుతోంది.వారు ఆర్థిక తదితర లాభాలు సంపాదించేందుకు, మనదేశం మార్కెట్ అయ్యింది. లాభాల రూపంలో. డివిడెండ్ల రూపంలో, రాయల్టీల రూపంలో, తదితరంగాను - ఏటా వందలాది కోట్ల విదేశమారక ద్రవ్యాన్ని తరలించుకుపోతున్నారు. విదేశీ పెట్టుబడులవల్ల దేశ పారిశ్రామిక రంగం, వారి గుప్పిట్లో చిక్కుకుపోయింది.

14. దేశంలోని వనరులతో, దేశంలోని శాస్త్ర సాంకేతికుల ప్రతిభతో. పరిశ్రమలను నెలకొల్పి పని చేయింపలేని అసమర్థ ప్రభుత్వం ఇది. పారిశ్రామికంగా మనకాళ్ళపై నిలబడలేని, పరాధీన స్థితిలోకి నెట్టివేయబడ్డాము.

15. ఆర్థిక సాంకేతిక సహాయం పేరిట, పారిశ్రామిక అభివృద్ధి పేరిట- విదేశీ పెట్టుబడిని విదేశీ రుణాలను, దేశంలోని వివిధ రంగాలలో చొచ్చుకుపోనిచ్చి - మన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు సంకెళ్ళు విధించిన పార్టీ ప్రభుత్వాలివి. ఎందుకిలాంటి ప్రభుత్వాలను అనుమతిస్తున్నట్లు? వాటి బారినుంచి పాలనా స్వేచ్ఛ బడసేందుకే,

మాదేశం పార్టీని స్వీకరించండి. గ్రామ, పట్టణ నగరాలంతటా స్వాగతించండి.

# _ _. సాంకేతిక పరిజ్ఞానం

1. శాస్త్రవిజ్ఞానము సాంకేతిక పరిజ్ఞానము నేడెంతగానో విస్తరించింది. సాంకేతికంగా అభివృద్ధికి, స్వయం ప్రతిభకు, ఆధారం పరిశోధనలే సమాజములోని అన్నిరంగాల పురోభివృద్ధి, పరిశోధనలపై, వాటిఅమలు పై ఆధారపడిఉంది. అట్టి పరిశోధనలపై ప్రభుత్వానికిగల నిర్లక్ష్యము, అసమర్థత కారణంగా భారతదేశం సాంకేతికంగా వెనుకబడిపోయింది.

2. కొత్త విషయాలు కొత్త సిద్ధాంతాలు కనుగొనడం, వాటికి అనుగుణంగా యంత్రాలు ఉత్పత్తులు తయారీలేని కారణంగా- మన పరిశ్రమలలో సగభాగం కాలదోషం పట్టిన యంత్రసామాగ్రితోను, సాంకేతిక పద్ధతులతోను నడుస్తున్నాయి. ఉదాహరణకు జనపనార, వస్త్రం, సిమెంటు, పంచదార, మందులు. ఇంజనీరింగ్ పరిశ్రమలు.

3. వ్యవసాయం - పశుగణాభివృద్ధి - నీటి వినియోగం - మత్స్య పరిశ్రమ - అటవీ అభివృద్ధి - ఇంధన వనరులు - గనుల త్రవ్వకం - ఖనిజాల అన్వేషణ - శక్తి ఉత్పాదన - ఎలక్ట్రానిక్స్ -కమ్యూనికేషన్‌లు రవాణా - విద్య - వైద్యం - దేశరక్షణ - అంతరిక్ష కార్యక్రమాలు మొదలగు అనేక రంగాల సాంకేతిక పరిజ్ఞానంలో వెనుక పడ్డాము.

4. విదేశాలు వదిలివేసిన సాంకేతిక పరిజ్ఞానాన్ని కొనుక్కుంటున్నాము. సాంకేతిక పరిజ్ఞానం కొనుగోలుకు, సాంకేతిక సహాయానికి, పెద్దమొత్తాలలో విదేశమారకం డబ్బు ఖర్చయి పోతున్నది. విదేశీ సాంకేతిక పరిజ్ఞానంతో పారిశ్రామిక అభివృద్ధి సాధించి, విదేశీ మార్కెట్లలో పోటీని తట్టుకోగలిగామా ? లేదు. దిగుమతులు తగ్గినవా ? లేదు. విదేశీ వ్యాపారంలో లోటు తగ్గిందా ? లేదు.

5. సాంకేతిక పరిజ్ఞానానికి ఏమో త్వరలో కాలదోషం పడుతోంది.

మన పరిశ్రమలు సాంకేతికంగా విదేశాలపై ఆధారపడి ఉంటున్నాయి. అలాంటప్పుడు విడిభాగాలు, యంత్రపరికరాలు, తెప్పించుకొనటంలో; ఎన్నో ఇబ్బందులు ఎదురవుతాయి.

6. మన స్వంత పరిశోధన అభివృద్ధితో; దిగుమతి వస్తువులు, యంత్రాలకు - ప్రత్యామ్నాయాలను ఉత్పత్తి చేసుకోలేక పోయాము.

7. ఎప్పటికప్పుడు సాంకేతిక పరిజ్ఞానాన్ని కొనుక్కునేందుకు, విదేశాలకు పరుగు పెట్టడమే కాని - దానిని మన అవసరాలకు తగినట్లు మన పరిజ్ఞానంతో జోడించి, అభివృద్ధి పర్చటం, స్వంతం చేసుకోవటం జరగలేదు,

8. దిగుమతి చేసుకొన్న సాంకేతిక పద్ధతులను, మన పరిశ్రమ లకు అనువుగా అభివృద్ధి చేసుకోవందుచే; అవి పాతబడి పోవటం, మరల దిగుమతి చేసుకోవల్సిరావటం జరుగుతోంది తప్పితే - సాంకేతికంగా స్వయం పోషకత్వం లేకుండా పోయింది.

9. పరిశోధనా సంస్థలపై ప్రజాధనం దుర్వినియోగమయ్యిందేకాని, మన పరిశ్రమల అవసరాలకు వీలైన శాస్త్రీయ, సాంకేతిక పరిశోధనలు పెంపొందలేదు.

10. దేశంలోని శాస్త్రజ్ఞుల, సాంకేతిక నిపుణుల, పరిశోధనా సామర్థ్యాన్ని ఉపయోగించుకోలేకపోవటం వల్లనే, శాస్త్ర సాంకేతిక స్థాయి పెంపొందలేదు.

11. పరిశోధనా సంస్థలకు - పారిశ్రామిక రంగానికి - ప్రభుత్వానికి మధ్య తగిన సమన్వయం ఏర్పడలేదు.

12. సాంకేతిక పద్ధతులను పెంపొందించటంద్వారా, పారిశ్రామిక ప్రగతిని పటిష్టం చేయలేదు. నూతన సాంకేతిక ప్రక్రియలు పెంపొందని కారణంగా పారిశ్రామిక అభివృద్ధి దెబ్బతింది.

13. విదేశీ సాంకేతిక సహాయంపై ఆధారపడటమే జరిగిందికాని-కీలకమైన ఉత్పత్తులను అధికం చేసుకోగల రీతిలో- విస్తృత ఉపాధిని కల్పించే రీతిలో- ప్రజల జీవన ప్రమాణం పెంచేరీతిలో- తక్కువ పెట్టుబడులతో ఉత్పాదకశక్తి పెరిగే రీతిలో- దేశీయమైన సాంకేతిక పరిజ్ఞానం పెంపొందలేదు.

14. స్వతసిద్ధమైన సాంకేతిక పరిజ్ఞానంలేని కారణంగానే; మానవ శక్తి తదితర భౌతిక వనరులతో అభివృద్ధిని సాధించలేక పోవటమేగాక, ఆధునికీకరణలో వెనుకబడ్డాం. దారిద్ర్యాన్ని తొలగించు కోలేకపోయాం.

15. పరిశోధన, అభివృద్ధి రంగాలకు, తగిన ప్రాధాన్యతఇవ్వనందు వలనే; అంతర్జాతీయంగా చెప్పుకో కలిగే ఏ వస్తువులను, యంత్రాలను తయారు చేసుకోలేని స్థితిలో ఉన్నాం.

16. విదేశాలు సాధించిన వైజ్ఞానిక సాంకేతిక సమాచారంతో మనలను పోల్చుకుంటే; ఎంతగా వెనుకన పడి ఉన్నామో। ఈ దుస్థితిలోకి తెచ్చిన ప్రభుత్వాన్ని వదిలించుకొందుకే,

మాదేశంపార్టీ. మాదేశం అది మనస్వంత పర్చుబడిన పార్టీ.

# 2. కొనుగోలు, అమ్మకం

1. కొనుగోలు అమ్మకం వ్యాపారవర్గాలకు వదిలివేయ బడటంతో, సరకులు ఏవీ న్యాయమైన ధరలకు లభించటంలేదు. వ్యవసాయ ఉత్పత్తులలో కొన్నింటికి, కేంద్రమే ధరలను నిర్ణయిస్తున్నది. వస్తూత్పత్తికి ధరల నిర్ణయం; పారిశ్రామికవేత్తల చేతుల్లో ఉండిపోయింది. వస్తువుల ధరలు ఏమో ఎక్కువ, పంటల ధరలు ఏమో తక్కువ అవటంచే, రైతాంగం నష్టపోతున్నది.

2. ప్రభుత్వ కంట్రోళ్ళ విధానంచే; ఒకే వస్తువుకి అసలుధర, బ్లాక్‌మార్కెట్ ధర ఏర్పడింది. ప్రభుత్వం నిర్ణయించే ధరలు; పెట్టుబడిదార్లకు లాభాలు చేకూర్చేవిగా, కొనుగోలుదార్లను పట్టించుకోనివిగా ఉన్నాయి.

3. పంటలు రైతుల చేతికందిన సమయంలో, ధరలు పడిపోతున్నాయి. రైతులు అయినకాడికి అమ్ముకొంటున్నారు. దళారులు వ్యాపారులు సరకుకొని నిల్వచేసిన తదుపరి, ధరలు పెరగటం మామూలు అయ్యింది.

4. పంటల విషయంలో దేశీయ అవసరాలేమిటో- నిల్వలు ఏమేర ఉన్నవో- విదేశీ ఎగుమతికి లభ్యమయ్యే సరకు ఏమేర ఉందోలేదో-మొదలగు వివరాలపై వాస్తవ పరిస్థితి తెలియదు.

5. కొనుగోలు అమ్మకం నిమిత్తమై, పట్టణనగరాలంతటా అవసరానికి మించిన వ్యాపారులు వ్యాపారంవల్ల- కొనుగోలు చేసే ప్రతి వస్తువుకు, ఎక్కువ డబ్బు చెల్లించాల్సి వస్తున్నది. ఉత్పత్తిదార్లకు చెల్లించే ధరలకు, అమ్మకం ధరలకు, చాలా తేడా ఉంటున్నది.

6. ఉత్పత్తిదారులనుంచి సరకులు కొనుగోలుదార్లకు అందటంలో ఒక శాస్త్రీయ విధానంలేని ప్రభుత్వం ఇది.

7. చౌకదుకాణాలని పేరే. వాటిద్వారా ధరలు అదుపులోకి రాలేదు. గ్రామ ప్రాంతాలందు 3 లక్షల 20వేల చౌకదుకాణాలు ఉన్నా, వాటిద్వారా నిత్యావసర వస్తువుల సరఫరా క్రమబద్ధంగాలేదు.

8. కొత్తవారు రేషన్‌కార్డులు పొందటం సాధ్యపడకున్నది. ఒక కుటుంబానికి సరిపడా సరకు ఏదీ, రేషన్‌కార్డుపై లభించదు. ఏదో కొంత ఇస్తారు. తకిమాది బయట కొనుగోలు చేయాల్సిందే.

9. రేషన్‌కార్డులపై ఇచ్చే కోటాకోసం, చౌకదుకాణాల చుట్టూ తిరగాలి. క్యూలో గంటలకొద్దీ నిలబడాలి. త్రొక్కిసలాట ఘర్షణలు తప్పవు.

10. ధరలు పెరగవచ్చుననిగాని, ధరలు పెంచాలనెడి ఉద్దేశ్యంతో గాని, వస్తువులు అమ్మకుండా దాయబడుతున్నాయి, 2) బ్యాంకులనుంచి రుణాలను పొంది; గిట్టుబాటు ధరలపేర, లాభాల పేర, సరకులు నిల్వ చేయబడుతున్నాయి. 3) తక్కువగా పండిన పంటలను, ముందుగానేకొని నిల్వ చేయటంచే, కొరతలు ఏర్పడుతున్నాయి. 4] ఉత్పత్తి చాలినంత లేనపుడు, సరకులకు నిజమైన కొరత ఏర్పడుతున్నది. 5. పర్మిట్ల మీదనే కాకుండా బోగస్ సంస్థలు బోగస్ పర్మిట్లమీద సరకులను అక్రమంగా రవాణా చేయటంచే-ధాన్యాలు నూనెగింజలు పుష్కలంగా పండినచోటకూడా నిల్వలు తరిగి సరకు కొరత ఏర్పడుతోంది.

11. కొరతలవల్ల మార్కెట్‌లో వస్తువులు దొరకక, ప్రజలుఇబ్బంది పడుతున్నారు. సరకులకు మరింత గిరాకి ఏర్పడి, వ్యాపారస్థులు మరింత లాభార్జన చేస్తున్నారు. కాయగూరలు పండ్లకు ధరలు, మరీ అస్థిరంగా అడ్డగోలుగా ఉంది. రైతులవద్ద చౌకగా కొంటారు. అవి అమ్మ కానికి వచ్చేప్పుడు, వాటి ధరలు విపరీతంగా పెంచబడుతున్నాయి.

12. వస్తువులను అసలు ధరకు అమ్మకుండా, ఎక్కువధరకు

అమ్మటం బ్లాక్‌మార్కెట్. ధాన్యం పప్పులు నూనెలు ఇనుము మొదలగు సరకులను అక్రమంగా నిల్వచేస్తూ; బ్లాక్‌మార్కెట్ ద్వారా వందలకోట్లను కొనుగోలుదార్ల జేబుల్లో నుంచి గుంజేస్తున్నారు.

13. వస్తువును బోలిన వస్తువు అంటే, నకిలీవాటి ఉత్పత్తి బాగా పెరిగిపోయింది. నకిలీవి బాహాటంగా అమ్మబడుతున్నాయి. వాటిని కొని మోసపోతున్నారు.

14, ఉత్పత్తిదార్లు, టోకుచిల్లర వ్యాపారులువల్ల, సరుకులు కల్తీ కాబడుతున్నాయి. ప్రజల ఆరోగ్యం ధ్వంసం కాబడుతోంది.

15. తప్పుడు తూనికలు కొలతలు ద్వారా, కల్తీలద్వారా, ఏటా 1600 కోట్ల రూపాయలవరకు అక్రమంగా సంపాదిస్తున్నారు. ఆ మేర కొనుగోలుదార్లు దగాకు గురవుతున్నారు.

16. ప్రభుత్వం ఉత్పత్తిదార్ల వ్యాపారుల, అక్రమ లాభార్జనకు సహకరిస్తోందేకాని; కొనుగోలుదార్ల ప్రయోజనాలను కాపాడటంలేదు. ఎందుకంటే ఎన్నికల నిధులకి భారీగా విరాళాలు ఇచ్చేది; ఉత్పత్తిదార్లు వ్యాపారులుకాని, ఓటర్లు కాదుకదా.

17 ప్రభుత్వ విధానాలు ఏవీ బ్లాక్‌మార్కెట్టునుగాని, నకిలీ నాసి రకం వాటినిగాని, కల్తీలనుగాని, అరికట్టడంలేవు. అడ్డగోలుగా పెరిగే ధరలు నియంత్రించ బడటంలేదు. రైతుల కొనుగోలుదార్ల కష్టనష్టాలను గమనించి, పరిష్కరించలేని పార్టీ ప్రభుత్వాలివి. వాటిని తిరస్కరించండి. మనచేతుల్లోగల సాధనాయంత్రాంగమైన,

మాదేశంపార్టీని ఇంటింటా స్వీకరిద్దాం.

# ఉత్పత్తుల నిల్వ

1. ప్రతి ఏటా పండిన పంటలు అనేకవిధాల వ్యర్థమవుతున్నాయి. ఈ నష్టాలను చూచి అయినా వాటిని నివారించేందుకు, నిల్వ సదుపాయా

లను కల్పింపవలదా? పంటలు సరిగా పండనపుడు, నిల్వ సరుకేకదాఆధారం.

2. పురులు పాతర్లు గాదులు కొట్టాలు సంచులు గంపల్లో, నిల్వచేసే పద్ధతులు సరైనవికావు. సరైన పద్ధతులలో నిల్వచేయని కారణంగా, ఏటా పండిన పంటలలో చాలా భాగాన్ని నష్టపోతున్నాం.

3, ఆహార ఉత్పత్తుల కొనుగోలు, నిల్వ, అమ్మకము, ప్రవేటు వ్యాపారం కావటంచే; ఎక్కడ ఎంతగా వాటికి నష్టం వాటిల్లుతున్నదో?

4. ఇక వస్తువుల విషయంలో కూడా; ప్యాకేజింగ్‌లో లోపాలు, నిల్వలో లోపాలు, రవాణాలో లోపాలవల్ల-ఏటా వేలకోట్లలో నష్టం సంభవిస్తోంది. 1981లో ఈ నష్టం 3 వేల 500 కోట్లు.

5, వినియోగదార్లు చెల్లించే ధరలవల్ల; రైతులకు వ్యాపారులకు ప్రభుత్వానికి లాభాలు చేకూరుతున్నాయి. ఎవరికివారు లాభాలు గుంజుకోవటం; ఆ డబ్బును వేరే కార్యకలాపాలకి వాడుకోవటం జరుగుతోందిగాని-సరకులను శాస్త్రీయ పద్ధతులలో నిల్వ చేసేటందుకు ఉపయోగించుటలేదు.

6. నిత్యం పాడవుతున్న పుచ్చు సచ్చు సరకులను,వినియోగదార్లకు అమ్మి వదిలించుకుంటున్నారు. సరకులలో వచ్చే తరుగుదల భర్తీకై, ఎక్కువ ధరలకు అమ్ముతున్నారు.

7. మన నివాసాలకు దేశవ్యాప్తంగా భవంతులు ఉన్నాయి కాని-అనునిత్య పోషణ కావించే, జీవితాధార సరకుల నిల్వకు, సౌకర్యాలుఏవి? అవి ఎంత నిర్లక్ష్యంగా క్రిమికీటకాల దాడికి వదలబడ్డాయో? వాటినెంతగా ఎలుకలు తినివేస్తున్నాయో? అవెంతగా తేమచే చెడిపోతున్నాయో?

8. ఆధునిక సదుపాయాలతో కూడిన శీతల గిడ్డంగులు మార్కెట్లు లేనందుచే; కాయగూరలు పళ్ళు కుళ్ళి పాడవుతున్నాయి. ఏటా పండించే 500 లక్షల టన్నుల కాయగూరలు పళ్ళలో, 20నుంచి 40శాతం వరకు పనికిరాకుండా పోతున్నాయి.

6)

9. కాయగూరలు పళ్ళు చేపలు గ్రుడ్లు మొదలగువాటి ఎగుమతికి సకాలంలో పార్శెల్ వ్యాన్‌లు కేటాయించనందువల్ల, అవి చెడుతున్నాయి అవి చెడిపోని రీతిలో రవాణా జరగటంలేదు.

---

10. ప్రభుత్వ ఆహారసంస్థ సేకరించి నిల్వచేసే బియ్యం గోధుమలలో, ఏటా లక్షలాది టన్నులు పాడవుతున్నాయి. 1980-81లో 6లక్ష 50వేల టన్నుల అహారధాన్యాలు నాశనమైనట్లు అంచనా.

11. ధాన్యం పంటలో ఒకశాతం ఉత్పత్తినే ప్రభుత్వం నిల్వఉంచ కల్గుతుంది. ధాన్యాల నిల్వకు సరిపడా గిడ్డంగులు లేవు. అందుచే ఆర బయట ప్రదేశాల్లోను, తేమగా ఉన్న ప్రాంతాలందు నిల్వ చేస్తున్నారు. అవి అలా నెలల తరబడి వదిలివేయ బడటంతో, వర్షము గాలులు తుఫాన్ల నుంచి రక్షణలేక నాశనం అవుతున్నాయి. ఒకోసారి రైల్వేగూడ్స్‌యార్డ్ వద్ద, విమానాశ్రయాలవద్ద, ఎండకు ఎండుతూ వానకు తడుస్తూ పడి ఉంటాయి.

12. గిడ్డంగులలోకి వర్షం కారటము, తుఫాన్లకు గిడ్డంగుల పై కప్పులు ఎగిరిపోవటము ఉంది. ప్రభుత్వ గిడ్డంగులలో నిల్వచేసిన సరకులలో, విషరసాయనాలు చేరి ఉంటున్నాయి. అవి అనారోగ్యాన్ని వ్యాధిని కల్గించేవి.

13. శాస్త్రీయమైన పద్ధతుల ననుసరించి, సరకులు నష్టపోకుండా నిల్వ చేయించలేని ఈ నిరర్థక ప్రభుత్వంవల్ల; ప్రభుత్వ గిడ్డంగులలోని ధాన్యాలు ముక్కిపోతున్నాయి. పురుగుపట్టి పుచ్చిపోతున్నాయి. తడిసి బూజుపట్టి పోతున్నాయి. చివరకు పశువుల మేతకు కూడా పనికిరాక పోవటంచే పారబోస్తున్నారు. ఇలా పారబోసే ధాన్యం 2నుంచి 3శాతం వరకు ఉంటున్నది.

**14.** పార్టీప్రభుత్వ సేకరణ, నిల్వ, పంపిణీకి; ఒకప్రక్కన భారీ ఎత్తున ఖర్చులు అవుతున్నాయి. మరోప్రక్క నష్టాలు అపారంగా ఉన్నాయి.

15. వ్యాపారమాయో లేక అవినీతిని కప్పిపుచ్చు కొందుకోలేక మరే కారణం వలనోగాని- ప్రవేటు వ్యాపారస్థులు నిల్వ ఉంచే, ప త్తి జనపనార పొగాకు తేయాకు వంటివి తగులబడుతున్నాయి. అలాగే ప్రభు త్వం నిల్వ ఉంచుతున్న చోట, దారుణ అగ్ని ప్రమాదాలలో సరకుబూడిద వుతోంది.

16. ఒకప్రక్క ఆకలి బీదరికం పీడిస్తుండగా; మన ఆహారం, మన శరీరశక్తి, నిల్వ సదుపాయాలులేక నాశనమవు తున్నాయి. ఈ ప్రభుత్వం ఇటీవల ఆసియా క్రీడోత్సవాలపై వందలకోట్లు ఖర్చు చేసింది. మనం మన భూములతో, మన పశువులతో, మన పైరులతో, శ్రమించి పండించు కున్న పంటలకు; నిల్వ సదుపాయాలైతే సమకూర్చలేదుగాని- పరిపాలి స్తున్న నాటినుండి వేలాది కోట్లను వృధా ఖర్చుల పాల్జేసింది. ఉత్పత్తులకు రక్షణ ఒసంగలేని, ఈ ప్రభుత్వ వైఫల్యం క్షమార్హం కానిది. ప్రజలంతా స్వపరి పాలనకై ఉద్యమించండి.

మాదేశంపార్టీ నినాదాన్ని ఇంటింటా ధ్వనింపజేయండి.

# ౨౯. కల్తీలు

ప్రభుత్వ అసమర్ధత అవినీతివల్ల, ఉత్పత్తిదారుల వ్యాపారం దురాశ అక్రమ లాభార్జనవల్ల; మన ఆహారం కాలుష్యపరచ బడుతోంది. కల్తీలేని సరకులు దొరకవాయె కల్తీలేని ఆహారం అమ్మబడదాయె. ప్రతి దానిలోను ఎంతోకొంత కల్తి.

ఆహార పదార్థాల తయారీ, నిల్వకు, సువాసనకు, ఆకర్షణకు వాడబడే; వేర్వేరు కృత్రిమ రసాయనాలలో అధికశాతం, ఆరోగ్యానికి హాని కల్గించేవే. కృత్రిమ రసాయనాలలో రంగులు ఒకటి. ప్రభుత్వ అనుమతి లేని ప్రమాదకర రంగులు- తినుబండారాలలో, శీతలపానీయాలలో, ప్యాకింగు ఆహారాలలో వాడబడుతున్నాయి.

కాయగూరలు పళ్ళు ఎక్కువరోజులు నిల్వ ఉండేందుకు- పండ్లు పచ్చికాయలను కృత్రిమంగా పక్వానికి తెచ్చేందుకు- వడిలి వాడిన కాయగూరలు తాజావిగా కన్పించేందుకు- ఘనద్రవ వాయు పదార్థాలను వాడుతున్నారు.

కల్తీ పదార్థాలు కలపటంవల్ల, క్రిమి సంహారక మందులు చేరటం వల్ల, అపరిశుభ్రతవల్ల, సూక్ష్మజీవులు క్రిములు ప్రవేశించి వృద్ధి చెందటంవల్ల, వంటకాలు చేసేప్పుడు పాత్రలవల్ల; అనేకవిధాల ఆహారం కాలుష్యపర్చబడుతోంది. ఆకారణంగా ఎన్నోరకాల వ్యాధులు వాటి దుష్ఫలితాలతో, ప్రజలు బాధలు పడుతున్నారు. ఏటా వేలాది మంది చనిపోతున్నారు. ఏటా లక్షలాది ప్రజలు రోగగ్రస్థులు అవుతున్నారు.

కల్తీ నిరోధక చట్టాలు, కల్తీ నిరోధక అధికారులవల్ల ప్రయోజనం లేకున్నది. కల్తీ నిరోధక అధికార్లకు లంచాలిచ్చి, కల్తీలను కొనసాగిస్తున్నారు. ఈ ప్రభుత్వం ఎందరు కల్తీదారులను శిక్షింప కల్గింది

క్రితం

ఈ ప్రభుత్వంవల్ల ఏమేర ఆహార కాలుష్యం అరికట్టబడింది? ఆరోగ్యంగా జీవించటం, అసంభవమవుతున్న స్థితికి జాతి చేరుకుంటోంది.

ఆరోగ్యాన్ని వదలుకొంటారా? లేక ఈ ప్రభుత్వాన్ని వదిలించు కొందుకై, మాదేశంపార్టీని స్వీకరించి స్వాగతిస్తారా?

-)....(-

# 14. గృహ వసతి

1. ఏడాదికేడాది గృహ నిర్మాణవ్యయం పెరుగుతోంది. ఎక్కడి కక్కడ దళారీలు, వారి వంచన ఎక్కువగా ఉంది. స్వంతఇళ్ళు కట్టుకొను టలో లేదా కొనటంలో ఎదురయ్యే ఇబ్బందులు, ఏవీ తొలగింప బడలేదు.

2. ఇల్లు కట్టేందుకు అనుమతులు, విద్యుత్ కనెక్షన్లు, నీటి సరఫరా మొదలగు వాటికొరకు ఎన్నోసార్లు తిరగాలి. అంతేగాక లంచాలు. సిమెంటు ఇనుము ఇటుకలు కలప కొనుగోలులో, ధరల తేడాలు. నాణ్యత నాసిరకం తేడాలు.

3. ఎక్కడికక్కడ చిన్నచిన్న కంట్రాక్టర్లు, మేస్త్రీలు, తాపీవారు, వడ్రంగులు బయలుదేరారు. వారికి గృహనిర్మాణంలో అనుసరించాల్సిన పద్ధతులు తెలియవు. వారివద్ద సరైన పనిముట్లు ఉండవు. సరైన అంచ నాలు వేయలేరు. వారివల్ల గృహనిర్మాణం అవకతవకలుగా సాగుతోంది.

4. తాపీ పనివారలు వడ్రంగులు కూలీల నిర్లక్ష్యంతోను- వత్తి డిచే పనులు ఆపటంతోను, తగవులుతోను, గృహనిర్మాతలు ఎన్నో ఇబ్బం

దులను ఎదుర్కొంటున్నారు. ఎవరికివారు తమ కాంట్రాక్టు పనులద్వారా, ఎక్కువడబ్బు గుంజేందుకై ప్రయత్నిస్తున్నారు కాంట్రాక్టు రేట్లు మిన్నంటాయి.

5. గృహనిర్మాణం పనులు లోపాలతో, దుబారా దుర్వ్యయంతో గాని పూర్తి కావటంలేదు. భవననిర్మాణ ఖర్చులు,అనుకోని రీతిలో పెరిగి, కష్టాలు ఎదురవుతున్నాయి.

6. పెరిగే ధరలతో తరిగే రూపాయి విలువతో, ఇల్లు కట్టుకొనుట-మధ్యతరగతి, పేదలకు దుస్సాధ్యంగా ఉంది. అనుకోకుండాఉక్కుసిమెంటు ధరలు పెరిగిపోతాయి. తలుపులు కిటికీలకై, కలపకు కొనలేనంత ధర. తాటాకు వెదురుకర్రలు ఏవీ కూడా కొనలేకున్నాం. ఇటుకల ధరలేకాదు, పట్టి రబ్బీసు ఇసుక ధరలు కూడా ఎక్కువే.

7. గృహనిర్మాణ సంస్థలు, జీవితభీమా, బ్యాంకులు మొదలగు వాటిచే ప్రభుత్వ రుణాలు అంటారేకాని; వాటిద్వారా ఎవరికీ తగినంతగా రుణం లభించటంలేదు. అవసరమైనంత అప్పు మంజూరు చేయకపోగా, అప్పుడోకాస్త అప్పుడోకాస్త ఇస్తూ, విపరీత జాప్యం చేస్తారు. ఆఫీసుల చుట్టూ తిప్పుతారు. బడాకంట్రాక్టర్ల ఆకాశహర్మ్యాలకు, సులభంగానే అప్పు లభిస్తుంది.

8. పలు అంతస్థుల భవన నిర్మాణం, ప్లాట్ల అమ్మకంలో; పెట్టుబడిదార్లు దళారీలు ప్రవేశించారు. అదొక లాభసాటి వ్యాపారంగా మారింది. నిర్మాణ సామాగ్రిలో నాణ్యత లోపించడం, ప్రమాణాలకు అనుగుణంగా లేకపోవటంవల్ల; ప్లాట్లు కొన్నవారు నష్టపోతున్నారు. సౌకర్యాలులోపించి ఇబ్బందులను ఎదుర్కొంటున్నారు. భవన నిర్మాణంలో ప్రవేశించిన నకిలీ సంస్థల వల్ల కొన్ని కూలిపోయాయి. మరికొన్ని కూలిపోయే స్థితిలో ఉన్నాయి.

9. ప్రభుత్వ నిర్మాణ సంస్థలు చేపట్టే గృహనిర్మాణం నత్తనడకగా సాగుతోంది. కనీసం పూర్తయిన ఇళ్ళయినా త్వరగా కేటాయించబడవు. బీదలకు కట్టించి ఇచ్చే ఇళ్ళు బీటలిస్తాయి. పైకప్పుల్లో పగుళ్ళు ఏర్పడతాయి. చౌక నిర్మాణంపేర పనికిరాని ఇళ్ళను కట్టిస్తుంది. వాటిగోడలు కప్పులు ఎప్పుడు కూలిపోతాయో తెలియదు.

10. రైతులనుంచి స్వాధీనం చేసుకున్న భూములకు సైతం తగిన నష్టపరిహారము చెల్లించరు. అందుకు కూడా పదేపదే త్రిప్పుతారు. పట్టణ నగర భూముల సేకరణలో, అమ్మకంలో, ఇళ్ళనిర్మాణంలో, ప్లాట్స కేటాయింపులలో- అధికారుల రాజకీయవాదుల అవినీతి, ఆశ్రిత పక్షపాతం కుంభకోణాలు సాధారణం అయ్యాయి.

11. దేశంలో 60శాతం కుటుంబాలకు స్వగృహాలు లేవు. ఇక ఉన్న వాటిల్లో సగానికిపైగా తలదాచుకొందుకేగాని, ఇళ్ళని చెప్పుకొందుకు లేదు. గ్రామాలలో 60శాతం పైగా పాకలలోనే జీవనం సాగిస్తున్నారు. అగ్ని ప్రమాదాల నుంచిగాని, పురుగుపుట్రా నుంచిగాని రక్షణలేదు. ప్రకృతి వైపరీత్యాలకు ఇవెంతమాత్రం తట్టుకొనలేవు. పట్టణ నగరాలలోని సగం మంది జీవితం; మురికివాడలలోనో, రోడ్లప్రక్కనో పేవ్‌మెంట్‌లపైనో కాలువలు రైలుమార్గాల ప్రక్కనో గడిచిపోతున్నది.

12. మురికివాడలు అంతటా చిన్నచిన్న పాకలు. ఇళ్ళల్లోకి గాలి వెలుతురు ప్రసరించదు. అన్నీ సందుగొందులు. డ్రైనేజీ లేకపోవటం తోను, వర్షపునీరు నిలవటంతోను, చెత్తాచెదారంతోను, క్రిక్కిరిసిన నివాసాలతోను- మురికివాడలు నరకకూపాలుగా మారాయి.

13 నగరాలలో ఎక్కడో చోటనైనా వసతి దొరకటం దుర్లభంగా ఉంది. ఇంటి అద్దెకే సంపాదనలో ఎంతో ఖర్చయి పోతున్నది. అద్దెలు భరింపలేక ఎన్నోకుటుంబాలు, ఒక్కొక్క గదిలో గడుపుతున్నారు. అద్దె

ఇళ్ళకొరకు వీధులెంబడి తిరుగుతూ, పనులు మానుకొని వెతుక్కోవాలి ఇక ఎక్కడికైనా బదిలీ అయితే ఎన్ని తిప్పలో.

14. ఒకప్రక్క ఇళ్ళకొరత. మరోప్రక్క భరించలేని అద్దెలు. ఎంత అద్దె చెల్లించినా సౌకర్యలేని ఇళ్ళు. ప్రభుత్వం అయితే తమ కార్యాలయాలకొరకు, ఏనాడో అద్దెకు తీసుకున్న వాటికి- అతితక్కువ అద్దెలు చెల్లిస్తూ, అదీ నెలకో ఏడాదికోమారో చెల్లిస్తూ, స్వంతదార్లను పీడించ కల్గుతున్నది. పార్టీలకు అధికారాన్ని అప్పగిస్తున్న ఫలితానికి, బ్రతుకులనుంచి కన్నీరు జాలువారుతోంది. ఇట్టి దుస్థితులనుంచి విముక్తికే,

ప్రజలకొక స్వంతపార్టీ. దానిపేరే మాదేశం.

# పట్టణ నగరాలు

దేశ జనాభాలో 4వ వంతు పట్టణనగరాలలో నివసిస్తున్నారు. భారీ మధ్యతరహా పరిశ్రమలు, వ్యాపార వాణిజ్యాలు ప్రభుత్వ ప్రవేటుకార్యాలయాలు, విద్యావైద్య ఉపాధి సౌకర్యాలు, సాంస్కృతిక సంస్థలు వంటి పలువాటిని నగరాలలో కేంద్రీకరింపజేసి- నగరాలను క్రిక్కిరిసిన జనాభాతో నింపి, పలుసాంఘిక ఆర్థిక సమస్యలను సృష్టించిన ప్రభుత్వాలివి.

వసతి మంచినీటి సరఫరా, డ్రయినేజి, పారిశుద్ధ్యం, మార్కెట్లు రోడ్లు, రవాణా, వీధిదీపాలు, ట్రాఫిక్ సమస్యలు, ప్రమాదాలు, కాలుష్యాలు, వ్యసనాలు, హింస, నేరాలు, అంటువ్యాధులు, మొదలగువాటి సంబంధించిన సమస్యలు- పట్టణనగరాలు అన్నింటిని వేధిస్తున్నాయి.

పట్టణనగరాలను మరింతగా పెంచి, పట్టణవాసుల సౌకర్యాలగూర్చి పట్టించుకోక, అవస్థల పాల్జేస్తున్న ఈ పార్టీ ప్రభుత్వాలను విడనాడేందుకే

ప్రజలకొక స్వంతపార్టీ మాదేశం.

# 15. వైద్య సదుపాయం

1. కాలేజీల నుంచి ఏటా 20వేలమంది డాక్టర్లు తయారవుతున్నారు. ...రిలో వైద్యం చేయగల సామర్థ్యం ఎందరికి ఉంది? గ్రామీణ ప్రాంతా...లో డాక్టర్లకు కొరత ఉంది. అయినా డాక్టర్లు విదేశాలకు వలసపోతు...న్నారు. వారి సేవలను కోల్పోతున్నాం.

2. ఏ వైద్య సౌకర్యమూ అందని గ్రామాలు వేలకువేలు. మొత్తం వైద్య సౌకర్యాలలో 15శాతం వరకే గ్రామీణులకు అందుతున్నాయి.

3. పనిచేయని ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు, పనిచేసినా రోగులకు ఉపకరించనివి, సరిగా పనిచేయని సిబ్బంది, నిధులు దుర్వినియోగం, మొదలైనవి సాధారణమై పోయాయి.

4. ప్రభుత్వ ఆస్పత్రులద్వారా ఉచిత వైద్యము అన్నది పేరుకే కాని, పేదలకు అట్టి సదుపాయాలు లభించటంలేదు. రోగుల నుంచి లంచాలు తీసుకోకుండా; డాక్టర్లు ఆస్పత్రి సిబ్బందితో పనులు చేయించలేకున్న ప్రభుత్వం ఇది.

5. ఆరోగ్యానికి బదులు అనారోగ్యం కల్గించే ఆస్పత్రులు-డాక్టర్లు మందులులేని ఆస్పత్రులు-డాక్టర్లు ఉన్నా సరిగా చూడకపోవటం-డాక్టర్లకు బదులు నర్సులచే చికిత్స, వంటి పరిస్థితులు ప్రభుత్వ ఆస్పత్రులలో నెలకొన్నాయి.

6. ఏ ఆస్పత్రులలో ఎలాంటి సౌకర్యాలు లోపించాయో, ఆసౌకర్యాలను కల్గించటంలేదు. ఆధునిక యంత్రపరికరాలు నెలకొల్పకపోగా, సాధారణ పరీక్షలకు పైతం సౌకర్యం లేకున్నది.

7. తక్కువ ఖర్చుతో సులభంగా నయమయ్యే వ్యాధులతో, గ్రామీణ ప్రజ బాధలుపడుతున్నారు. రోగులకు రోగనిర్ణయం సరిగా జరగ

టంలేదు. చికిత్సా లోపాలవల్ల, రోగుల పరిస్థితి విషమించుతోంది.

8. కాన్పుల సమయాలందు, శిక్షణ పొందిన మంత్రసానుల సహాయం లభించనందుచే; ఎందరో స్త్రీలు మరణిస్తున్నారు.

9. అవసరం లేకున్నా రకరకాల పరీక్షలు తోటి, మందుల ధరలు తోటి, డాక్టర్ల ఫీజుల తోటి; ప్రవేటు వైద్యం క్రింద అయ్యే ఖర్చులు భరించలేనివి అయ్యాయి.

10. రోగనిర్ధారణలో, చికిత్సలో, ఆపరేషన్ల లో, ఆధునిక యంత్ర పరికరాలు ఎన్నో వాడుకలోకి వచ్చినా; వాటిద్వారా ఈ ప్రజానీకం ప్రయోజనాలను పొందలేకపోతున్నది.

11. మందుల పరిశ్రమను బహుళజాతి కంపెనీల వశం చేయటం వల్ల; వారు అపారమైన లాభాలను తరలించుకు పోతున్నారు. ఈ ప్రజలకేమో నిత్యావసర మందులు చౌకలో దొరకనివి అయ్యాయి.

12. కల్తీ మందులు నకిలీ మందులు నాసిరకం మందులతో ప్రజల ఆరోగ్యానికి తీవ్రనష్టం కల్గుతున్నా-పనికిమాలినవి, కాలం చెల్లినవి, దుష్ఫలితాల నిచ్చేవి అయిన, వాటి అమ్మకం కొనసాగుతూ ఉంది.

13. రోగాలు నయం చేసుకొందుకు ప్రవేటు ప్రభుత్వ ఆస్పత్రుల చుట్టూ తిరుగుతూ, నానాయాతనలు పడుతున్న ప్రజల దుస్థితి తొలగేదెప్పుడు?

14. రోగులుగా రోగపీడితులుగా ఎంతోకాలం గడుపుతూ, బ్రతుకు పైనే నిరాశ కల్గించే పరిస్థితులు ఇంకెంతకాలం?

15. రోగులకు చికిత్సా ప్రమాణాలను పెంచడంలోను, రోగుల అవసరాలను నెరవేర్చడంలోను; ఈపార్టీ ప్రభుత్వాలు ఘోరంగా విఫలం అయ్యాయి.

16. వైద్యం దేనికి సంబంధించినది? చావు బ్రతుకుల మధ్య

జీవితానికి. అట్టి అతిప్రాముఖ్యతగల వైద్య సదుపాయాలను, ఆరోగ్య సౌకర్యాలను, ఈ ప్రజానీకం పొందలేక పోతున్నారంటే; ఈ చేతకాని ప్రభుత్వపాలనే కారణం. అందుచే ఈప్రజ స్వపరిపాలన దిశగా మరలాలి. ఆ నిమిత్తమే,

మనకొక స్వంత పార్టీ మాదేశం.

# 6. కుటుంబ నియంత్రణ

1. ప్రజలు తమ భవిష్యత్తును నిరాశాజనకము, ఆందోళనా భరితము కావించుకునే రీతిలో-జనాభా పెరుగుదలకే ఈ ప్రభుత్వం తోడ్పడుతోంది. అధిక జనాభా దుష్పరిణామాలతో, దేశం అభివృద్ధిని సాధించకుండా- ఈ ప్రభుత్వం ప్రజలకు ద్రోహం చేస్తున్నది.

2. సంతానోత్పత్తి స్థితిలో ఉన్న 10కోట్ల దంపతులలో, నాలుగో వంతు కూడా కుటుంబ నియంత్రణను పాటించటంలేదు. ప్రతి ఏడాది 1½ కోట్ల చొప్పున, దేశానికి అదనంగా జనసంఖ్య కలుస్తోంది. స్వాతంత్ర్యం పొందిన 1947లో మన జనాభా 35 కోట్లు మాత్రమే.

3. ఈ పార్టీ ప్రభుత్వాలు కుటుంబ నియంత్రణ కార్యక్రమాలపై కోట్లాది రూపాయలు ఖర్చుచేయటం; అందులో కొంత దుర్వినియోగ పర్చటం తప్పితే, తగు ఫలితాలను రాబట్టలేకపోయాయి. కుటుంబ నియంత్రణపై విముఖత కల్గించే కారణాలు, విశ్వాసాలు అవరోధాలు ఏవేమిటో-అజ్ఞానం అపోహలు ఏమిటో-వాటిని తొలగింపలేదు. జనాభావేగంగా పెరిగేందుకే ఈ ప్రభుత్వం దోహదపడింది.

4. కోట్లాది మందికి తిండి బట్ట వసతి మంచినీరు వంటి కనీసావసరాలే నెరవేరటం లేదు. నిరుపేదల దారిద్ర్యం మరింత హెచ్చుతున్నది. కూలీలకు పనిదినాలు తగ్గిపోయాయి. సంపాదన తగ్గింది. ఉపాధి సౌకర్యాలు తగ్గాయి. సేద్యపు భూమి తగ్గుతోంది. అడవులు నశిస్తున్నాయి. కాలుష్యాలు పెరిగాయి. పట్టణాలు క్రిక్కిరిసిపోతున్నాయి. అంతటా మురికివాడలు. పారిశుద్ధ్యంచూస్తే ఘోరం. సరైన రోడ్లులేవు. ప్రమాదాలు విపరీతం. రవాణా లోపభూయిష్టం. మోసం దౌర్జన్యం నేరాలు మితిమీరి ఆందోళన పరుస్తున్నాయి. అయితేనేం? ఈపార్టీ ప్రభుత్వాలకు పట్టదు. ఓటర్లఓట్లను కాజేయటమేకాని, జనాభా పెరిగిపోవటంచే-ఈదేశ ప్రజలపై విరుచుకు పడుతున్న సమస్యలను అర్ధం చేయించటంలేదు.

5. కుటుంబ నియంత్రణ ప్రాధాన్యతను వివరించటంలోను, కుటుంబ నియంత్రణకై తగు పటిష్ట విధానాలను అసలు పర్చటంలోను, ఎదురైన వైఫల్యాలను తొలగించి వేసుకొందుకే,

భారతీయులకొక స్వంతపార్టీ. దానిపేరే మాదేశం.

# 17. విద్య

1, ఈ విద్యకు ఉపాధి కల్పనాశక్తి లేదు. ఈ విద్యాసంస్థల మధ్య సమన్వయంలేదు. ఈ విద్యాసంస్థల నిర్వహణ లోపభూయిష్టము. ఈదేశావసరాలకు అనువైన విద్యావిధానం గూర్చిన అవగాహనలేని ఈ ప్రభుత్వంవల్ల; పాఠ్యప్రణాళికలలో, తరగతులలో, పరీక్షలలో, సంస్కరణల పేర, విద్యారంగంపై ప్రయోగాలు చేస్తున్నారు. ఆ కారణంగా విద్యారంగం తరచు మార్పులకు లోనవుతోంది.

2. ఉద్యోగాలు వృత్తులకు తగ్గట్టు, విద్యావిధానంలో మార్పులు తేబడలేదు. శాస్త్ర సాంకేతిక రంగాలలోని అభివృద్ధికి అనువుగా విద్యను బోధనను విద్యాలయాలలో ప్రవేశపెట్టలేదు. ఈప్రభుత్వం నేర్పించే సాంకేతిక విద్య, శిక్షణసైతం, లోపాలతో కూడి ఉంది. పాఠ్యప్రణాళికలోను, బోధనాపద్ధతిలోను, పరీక్షా విధానంలోను అంతా అస్తవ్యస్తత నెలకొంది.

3. విద్యాసంస్థలలో సీట్లు లభించేందుకు దరఖాస్తులు పంపటం, ప్రవేశపరీక్షలు, దరఖాస్తు ఫీజులు, కాలేజీలచుట్టూ తిరగటం, డొనేషన్లు వంటి వాటితో-ఉన్నత విద్యాభ్యాసం విద్యార్థులకు తల్లిదండ్రులకు దురవస్థను కల్గిస్తోంది.

4. తల్లిదండ్రులు తమ పిల్లలను స్కూళ్ళలో జేర్పించి చదివించేందుకే, నానాయాతనలు పడుతున్నారు. రాను రాను ధనవంతుల పిల్లలే చదువుకో గలరుగాని, మిగతావారికది సాధ్యపడేట్లు లేదు. ప్రయివేటు విద్యాసంస్థలు డొనేషన్లు ఫీజులుపేర, అధికాధికంగా వసూలు చేస్తున్నాయి. అవి విద్యను వ్యాపారంగా మార్చాయి.

—

5. వేర్వేరు రాష్ట్రాలలో, వేర్వేరు పాఠ్యప్రణాళికలు. అలాగే విద్యాబోధన వేర్వేరు బాషల్లో కొనసాగుతోంది. మరో ప్రాంతానికి వెళ్ళి చదువుకోవటంలో, ఎన్నో ఇబ్బందులు ఎదురవుతున్నాయి. త్రిభాషా సూత్రం పేర విద్యార్థులపై, భాషాభారం మోపబడింది. ప్రాంతీయబాషను కూడా కాలేజీస్థాయి వరకు నేర్పుతారు.

6. పాఠ్యపుస్తకాలు విద్యా సామర్థ్యాన్ని పెంచేవిగా లేవు. అందులో నవీన సమాచారం ఉండదు. పైగా అసందర్భపు వ్రాతలు తప్పులు కూడా ఉంటాయి. చిత్రాలు మ్యాపులు గ్రాపులు, అర్థమయ్యే రీతిలో ఉండవు. ఆ పాఠ్యపుస్తకాలను చదివి అర్థం చేసుకోవటం కూడా క్లిష్టము. పాఠ్యగ్రంధాల ముద్రణ, పంపిణీలో లోపాలచే, అవి సకాలంలో లభించకుండా ఉన్నాయి.

7. నిరుపయోగమైన పాఠ్యాంశాలతో, విద్యార్థుల ప్రతిభ వ్యర్థమవుతున్నది. విద్యను ఆర్జించడంలో విద్యార్థులకు శ్రద్ధాసక్తులు లేవు. ఉపాధ్యాయులు తమ విధులపై శ్రద్ధ చూపటం లేదు. అంతేగాక విద్యాబోధన, విజ్ఞానం విస్తరింపుకై, తగిన కృషి చేయటంలేదు.

8. విద్యార్థి సంఘాల ఎన్నికలలో తగాదాలు కొట్లాటలు, ఎంతో డబ్బు ఖర్చువంటి తతంగం ఏటా జరుగుతోంది. గెలిచినవారు ఓడినవారు బోధనను నష్టపోతున్నారు. పాటాలు జరగటంలేదు.

9. విద్యార్థులు చివరకు గైడులు ట్యూషనులు ట్యుటోరియల్ కాలేజీలపైన ఆధారపడి ఉత్తీర్ణులయ్యే విధంగా; ఈనాటి విద్యారంగం పని చేస్తున్నది.

---

10. ప్రస్తుత పరీక్షలు వాటిల్లో ఉత్తీర్ణత ఏమాత్రం సరిగాలేదు. ఏవో కొన్ని ప్రశ్నలు, వాటికి సమాధానాలు వ్రాయటమే పరీక్షలుగా

ఉన్నాయి. ఇక ఈ పరీక్షలు జరిపేందుకు విస్తృత ఏర్పాట్లు, డబ్బు ఖర్చు అవటం తప్పితే; వాటి ఆధారంగా కాలేజీలలో విద్యాలయాలలో సీట్లుగాని, ఉద్యోగాలు పొందేందుకుగాని, అవేమైనా ఉపకరిస్తున్నాయా? లేదు.

11. పరీక్షలు జరపటంలో, ఫలితాలు ప్రకటించటంలో, అవకతవకలు అరికట్టబడలేదు. పరీక్షాపత్రాలు వెల్లడవటం, ఉమ్మడిగా కాపీ చేయటం, మార్కులు వేయించుకొనడం వంటి అక్రమాలు జరుగుతున్నాయి. ఎక్కువమంది పాసు కాలేదని, మార్కులను కలిపి పాసు చేస్తున్నారు.

12. పనికిరాని విషయాలపై పరిశోధనలు సాగింప బడుతున్నాయి. పి. హెచ్.డి డిగ్రీలకు విలువ లేకుండా పోయింది. దొంగడిగ్రీ సర్టిఫికెట్లు, దొంగమార్కుల పట్టికలు కూడా లభ్యమవుతున్నాయి.

13. విద్యార్థులలో క్రమశిక్షణా రాహిత్యం ప్రబలింది. ఏదోఒక వాటిగురించి సమ్మెలు జరుగుతున్నాయి. ఇక కళాశాల సెలవులు, ఉపాధ్యాయుల సమ్మెలు, విద్యార్థి ఎన్నికలు, విద్యార్థి వర్గాలమధ్య కొట్లాట, అద్యాపకులపై దౌర్జన్యం; వంటివాటి కారణంగా కాలేజీలు విద్యాలయాలు మూతపడుతున్నాయి. అసలే బోధనా సమయం తక్కువ. ఇక ఈ రీతిలో జరిగే అలజడులవల్ల, ఏటా కోర్సులు పూర్తి కావటంలేదు. ఇక ఏదోలా పరీక్షల్లో పాసయ్యేందుకు ప్రయత్నిస్తున్నారు. ఇట్టివారే మరల కాలేజీల విద్యాలయాల ఉద్యోగాలలో నియమితు లవుతున్నారు. ఇక విద్యాప్రమాణాలు ఏం పెరుగుతాయి?

14. విద్యార్థుల కాలము విలువైనది. అది నిరుపయోగమైన సినిమాల వ్యాపకంతోను, రాజకీయాలతోను, ఆటపాటలతోను, కాలక్షేపంతోను నిరర్థకం కాబడుతోంది. రాజకీయ పార్టీలు తమ ఉద్యమాలకు ఆందోళనలకు, విద్యార్థులను ఉపయోగించుకొంటున్నారు. విద్యార్థులు రాజకీయరొంపిలోకి దిగి, చదువులు పాడుచేసుకొంటున్నారు.

ఉన్నాయి. ఇక ఈ పరీక్షలు జరిపేందుకు విస్తృత ఏర్పాట్లు, డబ్బు ఖర్చు అవటం తప్పితే; వాటి ఆధారంగా కాలేజీలలో విద్యాలయాలలో సీట్లుగాని, ఉద్యోగాలు పొందేందుకుగాని, అవేమైనా ఉపకరిస్తున్నాయా? లేదు.

11. పరీక్షలు జరపటంలో, ఫలితాలు ప్రకటించటంలో, అవకతవకలు అరికట్టబడలేదు. పరీక్షాపత్రాలు వెల్లడవటం, ఉమ్మడిగా కాపీ చేయటం, మార్కులు వేయించుకొనడం వంటి అక్రమాలు జరుగుతున్నాయి. ఎక్కువమంది పాసు కాలేదని, మార్కులను కలిపి పాసు చేస్తున్నారు.

12. పనికిరాని విషయాలపై పరిశోధనలు సాగింప బడుతున్నాయి. పి. హెచ్. డి డిగ్రీలకు విలువ లేకుండా పోయింది. దొంగడిగ్రీ సర్టిఫికెట్లు, దొంగమార్కుల పట్టికలు కూడా లభ్యమవుతున్నాయి.

13. విద్యార్థులలో క్రమశిక్షణా రాహిత్యం ప్రబలింది. ఏదో ఒక వాటిగురించి సమ్మెలు జరుగుతున్నాయి. ఇక కళాశాల సెలవులు, ఉపాధ్యాయుల సమ్మెలు, విద్యార్థి ఎన్నికలు, విద్యార్థి వర్గాలమధ్య కొట్లాట, అధ్యాపకులపై దౌర్జన్యం; వంటివాటి కారణంగా కాలేజీలు విద్యాలయాలు మూతపడుతున్నాయి. అసలే బోధనా సమయం తక్కువ. ఇక ఈ రీతిలో జరిగే అలజడులవల్ల, ఏటా కోర్సులు పూర్తి కావటంలేదు. ఇక ఏదోలా పరీక్షల్లో పాసయ్యేందుకు ప్రయత్నిస్తున్నారు. ఇట్టివారే మరల కాలేజీల విద్యాలయాల ఉద్యోగాలలో నియమితు లవుతున్నారు. ఇక విద్యాప్రమాణాలు ఏం పెరుగుతాయి?

14. విద్యార్థుల కాలము విలువైనది. అది నిరుపయోగమైన సినిమాల వ్యాపకంతోను, రాజకీయాలతోను, ఆటపాటలతోను, కాలక్షేపంతోను నిరర్థకం కాబడుతోంది. రాజకీయ పార్టీలు తమ ఉద్యమాలకు ఆందోళనలకు, విద్యార్థులను ఉపయోగించుకొంటున్నారు. విద్యార్థులు రాజకీయరొంపిలోకి దిగి, చదువులు పాడుచేసుకొంటున్నారు.

# 18. నిరుద్యోగం

18. విద్యాసంస్థలు ఇచ్చే డిగ్రీలవల్ల నిరుద్యోగం పెరుగుతోంది తప్పితే, జీవనోపాధికి పనికిరావటం లేదు. డాక్టర్లు ఇంజనీర్లు శాస్త్రజ్ఞులకు తగిన ఉపాధి అవకాశాలు, పరిశోధనా సౌకర్యాలు కల్పించలేకపోయిన ప్రభుత్వం కారణంగా; వారంతా విదేశాలకు వెళ్ళి, వారి ప్రతిభతో ఆయా దేశాల ఆర్థికాభివృద్ధికి, సేవాసౌకర్యాలకు తోడ్పడుతున్నారు. విదేశాలలో పనిచేస్తున్న భారతీయ నిపుణుల సంఖ్య 30వేలకు పైగా ఉన్నారు. అందులో 15వేల మంది డాక్టర్లు. విదేశాలలో స్థిరపడ్డ భారతీయులు కోటికి పైగా ఉన్నారు.

19. ఒకప్రక్క ఎందరో నిరుద్యోగులు ఉండగా; 5నుంచి 14సంవత్సరాలలోపు బాలకార్మికులు, కోటి 73 లక్షలమంది అతితక్కువ వేతనాలపై పనులు చేస్తున్నారు. వారిశ్రమకు తగ్గ వేతనంగాని, ప్రమాదకర పనుల నుంచి రక్షణగాని లభించటంలేదు.

20. ఒకవైపు కోట్లాది నిరుద్యోగులు. మరోవైపున వృత్తి నైపుణ్యాంకల పనివారలు లభించక, ప్రజానీకం నానా ఇబ్బందుల పాలవుతోంది.

21. దేశంలో విద్యావంతులైన నిరుద్యోగులు 1986 ఆఖరుకు 2 కోట్ల 99లక్షలు. గ్రామ ప్రాంతాలలో చదువుకోని నిరుద్యోగుల సంఖ్య దాదాపు 4కోట్లు. ఏటా నిరుద్యోగం 10శాతం పెరుగుతోంది.

22. ఉద్యోగార్థుల ఎంపికకై, వ్రాతపరీక్షలు ఇంటర్వ్యూలు జరపబడుతున్నాయి. దరఖాస్తులతోబాటు ఫీజులను, రానుపోను ప్రయాణ ఖర్చులను, నిరుద్యోగులు భరిస్తున్నారు. ఇంత జరిగినా; ఈ పరీక్షలు ఇంటర్వ్యూలు ఒక నాటకంలా మారితే? తెలివికి కృషికి గుర్తింపు లభించకుండా పోతుంటే?

23. ఉద్యోగం కావాలంటే లంచం, బదిలీ కావాలంటే లంచం.

లంచగొండితనంతోను బంధుప్రీతితోను ఉద్యోగ నియామకాలు జరుగుతున్నాయి. అనుకూలంగా ఉద్యోగాలు వేయించుకొనటంలో, కోరుకున్న చోటికి బదిలీ చేయించు కొనటంలో, బదిలీల నిలుపుదలలో- ఉన్నతాధికార్లు రాజకీయవాదులు అక్రమంగా సంపాదిస్తున్నారు.

24. అక్రమంగా ప్రమోషన్లు ఇవ్వబడుతున్నాయి. పదవీ నియామకాలలో, సీనియారిటీని ప్రక్కకు నెట్టి వేస్తున్నారు. అసమర్ధులకు లంచగొండులకు ప్రమోషన్లు లభిస్తున్నాయి. ఉద్యోగాలు అనర్హుల కైవసం అవుతుంటే నష్టపోయేది ఎవరు? ప్రజలేకదా.

25. ఎటువంటి పనిలేక శ్రామికులశక్తి వృధా అవుతోంది. లక్షలాది కూలీలు పనులకోసం వెతుక్కుంటూ, ఎక్కడెక్కడికో వలస పోతున్నారు. వారి జీవితాలకు స్థిరమైన ఉపాధి ఏర్పాట్లు లేవు. గ్రామశ్రామికుల శ్రమశక్తి కొల్లగొట్టడం జరుగుతోంది తప్పితే; వారికి న్యాయం జరగటం లేదు. చదువుకున్న నిరుద్యోగులు: తమ విద్య శిక్షణపై, ఖర్చిడిన వయస్సుకు డబ్బుకు, ప్రతిఫలం లభించటంలేదు. పనులకోసం అటు కూలీలు, ఉద్యోగాల కోసం విద్యావంతులు, నానారకాలుగా తిప్పలు పడుతున్నారు.

26. భర్త నిరుద్యోగాన్ని భార్య చూడలేక, భార్యను పోషించలేక భర్త, పిల్లలను చూసి తల్లిదండ్రులు, తల్లిదండ్రులకు పట్టెడు మెతుకులు పెట్టలేక పోతున్నామేనని నిరుద్యోగులు-ఇలా జీవితం అంటేనే విరక్తి కల్గించే స్థితిలోకి నిరుద్యోగులు వదలబడ్డారు. జీవితాలను గడపటం ఎలా అన్న సమస్య, కోట్లాది కుటుంబాలను వేధిస్తున్నది.

27. నిరుద్యోగులకు ఉపాధి కల్పించడంలో, నిరుద్యోగ సమస్యను పరిష్కరించటంలో, ఘోరంగా విఫలమవటమేగాక- విద్య ఉద్యోగ సంబంధ విషయాలలో ప్రాంతీయ తత్వాన్ని, కులమత తత్వాలను పెంచింది. అవి రాజకీయాలకు ఆటపట్టులైనాయి. ఇట్టి ప్రభుత్వ పాలనను ఇంకెంత మాత్రం సహించవద్దు. స్వపరిపాలనే ధ్యేయంగా ఉద్యమించేందుకే,

మనకొక స్వంతపార్టీ మాదేశం.

# ౬. రవాణా

## రోడ్లు

1. మనుష్యుల వస్తువుల చేరవేత రవాణా. రవాణావల్ల ఒకచోట నుంచి, వేరొక చోటికి చేరటం జరుగుతోంది. మోటారు వాహనాలపై రవాణాకు రోడ్లు కావాలి.

2. గ్రామాలలో రోడ్ల పరిస్థితి అధ్వాన్నం. ఏ విధమైన రోడ్లులేని గ్రామాలు, పక్కారోడ్లు వేయని గ్రామాలే, నేటికీ దేశంలో ఉన్నాయి. జాతీయ రహదార్లు సైతం సరిగాలేవు. దేశంలో అభివృద్ధి పరచాల్సిన జాతీయ రహదారుల నిడివి 32వేల కి.మీ.

3. రోడ్లు చూస్తే వంకరటింకర. అవైనా చదునుగా ఉండవు. రోడ్లపై గతుకులు గుంటలు. అనేకం రోడ్లు కంకర రోడ్లుగానే మిగిలి పోయాయి. వాటిపై చిందరవందరగా పైకిలేచిన రాళ్ళు. కంకర వేయని కచ్చారోడ్లకు ఇరువైపులా ముళ్ళచెట్లు. వానాకాలంలో మట్టిరోడ్లపైబురద వాటిపైన నడవటమే కష్టం.

4. కాలువల ప్రక్క రోడ్లపై, ట్రాఫిక్ పెరిగినా వెడల్పు చేయరు. కాలువ గట్లులను గట్టిపరచరు. పట్టణాలలోగల రోడ్లు అసలే ఇరుకు. ఆ రోడ్లపైనే ట్రాఫిక్‌కు అవరోధంగా ఆక్రమణలు. రోడ్లపైనే చెత్తాచెదారం. వాహనాల రాకపోకలతో దుమ్ముధూళి.

5. రోడ్ల పరిస్థితి రానురాను అధ్వాన్న మవుతున్నదేకాని బాగుపడ టం లేదు. ఇలాంటి రోడ్లపై వాహనాలను నడపటం దినదిన గండంగా ఉంది.

6. రోడ్లకు మరమ్మత్తులు జరపకుండా ఆలస్యం చేయటంచే, వాటిని పటిష్ట పరచేందుకు ఎన్నికోట్లు ఖర్చుచేయాలో? ఎన్ని సంవత్సరాలు పడతాయో?

7. జనాభా అవసరాలు, ట్రాఫిక్‌నకు తగినట్లు రోడ్లులేవు. ఈరోడ్ల వల్ల వాహనాలకు ఏటా వెయ్యికోట్లు నష్టం కల్గుతోంది. ఏటా 4వేః కోట్లకు పైగా పన్నులను వాహనాల నుండి వసూలు చేస్తున్నా, రోడ్ల అభివృద్ధిని పట్టించుకోవటంలేదు.

# బస్సులు

8. ప్రయాణీకులకు ఆధునిక సౌకర్యాలను కల్గించ లేకపోగా, నానా ఇబ్బందుల పాల్జేస్తున్నారు. ప్రయాణీకులు కష్టపడాల్సినది లేకుండా, రవాణా సర్వీసులు నిర్వహించబడటం లేదు.

9. స్కూళ్ళు ఆఫీసులు ఫ్యాక్టరీలకు, వెళ్ళేందుకు బస్సులు దొరకవు. గ్రామాలందు లైను స్టేజిలలో ప్రయాణీకులు ఉన్నా, ప్రభుత్వ బస్సులు ఆగవు. ప్రయాణీకులను గౌరవించే సిబ్బంది లేదు. పోర్టరు చార్జీలు, లగేజీల చార్జీలు ఎక్కువ. గ్రామాలందు లగేజీలు దించేవారు ఉండరు. గ్రామాలందు త్రిప్పేందుకు డొక్కు బస్సులు వేస్తారు. అవి తరచూ చెడిపోతాయి.

10. బస్సులమధ్య పోటీ- లారీల మధ్య పోటీ—— ప్రయాణీకుల మరియు సరకుల చేరవేతలో పోటీ- అవి వేగంతో దూసుకుపోవటం- లారీలలో ఓవర్ లోడింగు- శిక్షణ గరపని డ్రైవర్లు క్లీనర్లు- మెకానిజంలో లోపాలు- నాసిరకం నకిలీ విడిభాగాలు- డీసిల్ ఆయిల్స్‌లో కల్తీ- మొదలగు వాటిచే ఇంజన్లు దెబ్బతింటున్నాయి. వాహనాలు మన్నే కాలము తగ్గిపోయింది. వాహనాల నిర్వహణా వ్యయం పెరిగిపోయింది.

11. ఈ రోడ్లపై ఎదురెదురుగా వాహనాలు వస్తుంటే తప్పించుకోవటం కష్టం. గుంటలు గోతులులో, వాహనాలు దిగబడి పోతున్నాయి. సైకిళ్ళు స్కూటర్లు చిన్నకార్లు ట్రాక్టర్లు బస్సులు లారీలు;ఎలాంటి ప్రమా

దారికు గురికాకుండా, గమ్యస్థానం చేరకల్గుతాయన్న నమ్మకం లేకుండా ఉన్నది. డ్రైవర్లు నిర్లక్ష్యంగా ప్రమాదకరంగా నడుపుతున్నారు.

12. పట్టణాలందు సైతం బస్సుస్టేషన్లు లేవు. ప్రతి చిన్న పనికి ట్రాన్సుపోర్టు ఆఫీసుల చుట్టూ తిరగాలి. మాటిమాటికి బస్సురూట్ల జాతీయం పేరు విన్పిస్తారు. ఒక క్రమంలో జాతీయము చేయరు. జాతీయం చేసి ఎంతో పెట్టుబడి పెట్టారు. బస్సు చార్జీలను విపరీతంగా పెంచారు. ఎంత ఆదాయం లభిస్తున్నా, అవి నష్టాలతోనే నడుస్తున్నాయి. పెరిగే చార్జీలతో ప్రయాణం భారంగా పరిణమించింది.

# రైల్వే

1. దేశం అవసరాలకు తగ్గట్టు; రైల్వేలైన్లుగాని, రైళ్ళుగాని, రైల్వే సౌకర్యాలుగాని లేవు. రైల్వేలో 17లక్షల మంది ఉద్యోగులుగా ఉన్నారు.

2. రైల్వేస్టేషన్ల ఆధునికీకరణ నిర్లక్ష్యం చేయబడ్డది. స్టేషన్ల మధ్య మెరుగైన కమ్యూనికేషన్ సౌకర్యాలు లేవు. 250 స్టేషన్లలో గల సిగ్నలింగ్ పరికరాలు అధ్వాన్న స్థితిలో ఉన్నాయి.

3. దేశంలోగల రైలుమార్గాలలో 3వ వంతు బాగా దెబ్బతిన్న స్థితిలో ఉంది. 27వేల కి.మీ రైలుమార్గాన్ని పునరుద్ధరించే పని నత్తనడకగా సాగుతోంది, పాత రైల్వేపట్టాల స్థానే కొత్తవి, కర్రస్లీపర్లు, స్థానే కాంక్రీటు స్లీపర్లు మీటర్‌గేజ్ స్థానే బ్రాడ్‌గేజి వేయటం జరగాల్సి ఉంది.

4. రైలుపట్టాలు, సిగ్నల్స్. మరమ్మత్తులో ఉన్నాయి. చెడిన పరికరాలు, లైన్లుకు; మరమ్మత్తులు వెంటనే జరగకున్నవి.

5. రైలుమార్గాల విద్యుద్దీకరణకు ఎంత ప్రాముఖ్యత ఉన్నా 1987 నాటికి, 7వేల కి.మీ విద్యుద్దీకరణ మాత్రమే పూర్తయ్యింది.

6. రైళ్ళు పెరిగే కొలదీ; రైలు వంతెనలు చాలకంలేవు. రై
మార్గాలపైగల 10వేల వంతెనలలో, 70శాతం పాతబడి ప్రమా
స్థితిలో ఉన్నాయి. వాటి మరమ్మత్తులు గూర్చి పట్టించుకున్న వారు

7. రైళ్ళసంఖ్యకు అనువుగా; స్టేషన్లు, యార్డులు, సమపాళ
లేవు. పాతబడి కాలంచెల్లి నడుస్తున్న; స్టీమ్ డీజిల్ ఎలక్ట్రిక్, రై
ఇంజన్లు దాదాపు వెయ్యి ఉన్నాయి. 41వేల గూడ్సు వాగన్లు పని
సితిలో ఉన్నాయి. 38వేల పాసింజర్ కోచ్‌లలో, 13వేల కోచ్‌లు
పోయినవి.

8. రైల్వేవర్క్ షాపులలోని యంత్రాలు పాతబడ్డాయి. రై
ఇంజన్లు, పెట్టెలు, వేగన్లకు, మరమ్మత్తులు పటిష్టంగా జరగటం
పాతబడిన ఇంజన్లు, బోగీలు, వాగన్లు స్థానే; కొత్తవి వేయబడటంలేదు.

9. రైల్వేల అభివృద్ధి పథకాలలో జాప్యం జరుగుతోంది. కొ
రైల్వే ప్రాజెక్టులు చేపట్టడం లేదు. ఈ ప్రభుత్వంవల్ల రైల్వే క్షీణ
పోతున్నది.

10. దేశ అవసరాలకు అనువుగా రైల్వేద్వారా సరకుల ర
పెరగక, ఉత్పత్తి దెబ్బతింటోంది. గనులు మరియు పరిశ్రమలందు
త్తులను, సకాలంలో తరలించటం లేదు. ముడిసరకులు సకాలంలో
దించబడటం లేదు. రైల్వే రవాణాలో సరకులు దొంగిలించ బడటం
వాటికి భద్రత లోపించింది.

11. రైల్వే ప్రయాణీకుల సౌకర్యాలు భద్రతపట్ల, ఈ ప్రభు
నికి ఎట్టిశ్రద్ధలేదు. సాధారణ ప్రయాణీకులు కూర్చునేందుకు, కాదుక
నిలబడేందుకు కూడా స్థలం దొరకటంలేదు. 1వ తరగతి ఎ.సి. టూటై
త్రీటైర్, స్లీపరూ కోచింగు, రిజర్వుడు వంటి వాటికి పెట్టెలను
యిస్తూ- అధిక ప్రయాణీకులకు ఏమో రెండోక్లాసు జనరల్ కం

ుంట్ పేర, ఎక్కడో కొద్ది పెట్టెను ఉంచి- ప్రయాణం చేయటాన్ని ాకరం చేశారు.

12. రిజర్వేషన్ లేని ప్రయాణికుల పాట్లు ఎన్నో? బ్రోకర్లు ావెల్ ఏజన్సీలు, రైల్వే ఉద్యోగులు జరిపే అక్రమాలచే; సీట్లకోసం, ర్తులకోసం లంచం ఇవ్వాల్సి ఉంటోంది.

13. రైల్వేలలో ఆహారం ధరలు ఎక్కువ. పరోవైపు శుభ్రతలేదు ల్వేపోర్టర్లు అడిగినంత ఇవ్వకపోతే లగేజి చేరవేయరు. రైళ్ళు ఏమో ాలంలో నడవవు. వాటి రాకపోకలలోనేమో ఆలస్యం.

## జలరవాణా

రవాణాకు వీలైన నదీమార్గం 0వేల 241కి.మీ, కాలువ మార్గం వేల 300కి.మీ ఉన్నా; వాటిద్వారా రవాణా జరపటంపై ఎట్టిశ్రద్ధ ిహించలేదు.

సముద్రతీరం ఎంతఉన్నా తగినన్ని రేవులు ఏర్పడలేదు. పెద్ద రేవులవద్ద రద్దీ తొలగించ బడలేదు. చిన్న మధ్య తరహా రేవులలో, ఎగు మతి దిగుమతి సౌకర్యాలు బాగా తక్కువ. వర్షాకాలంలో సరకులు ఎత్తి ంపేందుకు ఆటంకం కల్గుతోంది.

సరకులను ఎత్తిదించే యంత్ర పరికరాలు పాతవి. సరకుల ఎత్తి ంపివేతకు అయ్యే ఖర్చు ఎక్కువ. నౌకలు సరకులు దించుకునేందుకు, పెద్దరేవులందు స్థానం దొరకక, ఎన్నో రోజులు ఆగిపోతున్నాయి. వాటి సమయము వృథా అవుతోంది.

## ప్రమాదాలు

రానురాను రోడ్డురైల్వే విమాన ప్రయాణాలు, ప్రమాదకరంగా పరి ణమించాయి. నానాటికీ ప్రమాదాలు ఎక్కువ అవుతున్నాయి. నిత్యం ఎం

దరో ప్రమాదాలకు గురవటాన్ని, నిత్యం ఎందరో ప్రాణాలు పోగొట్టుకోవటాన్ని, సాధారణం చేసిన ప్రభుత్వం ఇది. ప్రయాణీకులు సురక్షితంగా గమ్యం చేరుకుంటారన్న నమ్మకంలేదు.

రైలుమార్గాలను సిగ్నలింగ్ పరికరాలను ధ్వంసం చేయటం- ఫిష్ ప్లేట్లను తొలగించటం- స్టేషన్లకు నిప్పు పెట్టడం వంటి విధ్వంసకర చర్యలను అరికట్ట లేనందువల్ల ప్రమాదాలు కల్గుతున్నాయి. 1986లో జరిగిన రోడ్డు ప్రమాదాలు 40వేలు. రోడ్డు ప్రమాదాలలో ఏటా 2వేల కోట్లకు పైగా, ఆస్తినష్టం సంభవిస్తోంది.

మోటారు వాహనాలను ఆపి దోచుకుంటున్నారు. రైళ్ళలో దొంగతనాలు, దోపిడీలు జరుగుతున్నాయి. ఏటా రైల్వేల ఆస్తి దొంగిలించబడుతున్నది.

---

1. ప్రయాణాలను మరింత సురక్షితం చేసే, ప్రమాదాలను మరింతగా తగ్గించివేసే, రవాణా వాహనాల నిర్మాణం లేదు. లోపభూయిష్టమైన ఇంజన్లు డిజైన్లతో, పాతకాలం నాటి నిర్మాణాలే కొనసాగుతున్నాయి.

2. రవాణా కార్యకలాపాలకు గాని, దేశరక్షణ నిమిత్తమైగాని; ఆధునిక రీతిలో విమానాలు నౌకలు వేటిని, స్వంతంగా నిర్మించుకోలేని స్థితిలో ఉంచబడ్డాం.

3. ఈనాడు కొన్ని విదేశాలు అత్యాధునిక రీతిలో; కార్లు రైళ్ళు విమానాలను నిర్మించుకొంటున్నాయి. ఇంతకు ముందెన్నడూ లేనట్టి కొత్త రకం రైళ్ళు, కొత్తరకం విమానాలు, కొత్తరకం బస్సుల నిర్మాణంజరుగుతోంది.

4. దేశ అవసరాలలో 30శాతం పెట్రోలియంను, విదేశాలనుంచి తెప్పిస్తూ కూడా; ఈ ప్రభుత్వం రానురాను మోటారు వాహనాలను విమానయానాన్ని పెంచేస్తూ, ఇంధనాల ఖర్చును పెంచేస్తూ ఉంది.

5. సరకుల ప్రయాణీకుల చార్జీల ద్వారా ఎంత ఆదాయాన్ని రాబట్టు కుంటున్నా, ఏటా చార్జీలను పెంచుతున్నా; ఆ ఆదాయంతో రవాణా సంస్థలు అభివృద్ధి పథకాలను చేపట్టలేకున్నవి.

6. రవాణా సంస్థలలోని అవినీతిని అసమర్థతను, బాధ్యతారాహిత్యాన్ని తొలగింపలేని ప్రభుత్వంచే; రవాణా సంస్థల వ్యయం పెరిగి పోతున్నది. ఉద్యోగ నిర్వహణలో అక్రమాలు నేరాలకు పాల్పడుతున్నారు.

7. పన్నులు వేస్తారు. చార్జీలు పెంచుతారు. అయినా రోడ్డు రైల్వేలకు నష్టాలు వస్తున్నాయంటారు. ఖర్చులకు తగ్గ ఆదాయం రావటంలేదని మళ్ళా చార్జీలు పెంచుతారు. పెంచిన చార్జీలనే మరింత పెంచుతూ, ప్రయాణీకులను పీడిస్తున్న ప్రభుత్వం ఇది. ఈ ప్రభుత్వ పీడ విరగడయ్యేందుకే, స్వపరిపాలన దిశగా కర్తవ్యోన్ముఖులయ్యేందుకే,

మనకొక స్వంతపార్టీ మాదేశం.

# 2 . బొగ్గు, పెట్రోలియం

1. బొగ్గు పెట్రోలియం నిక్షేపాలు రోజురోజుకి తరిగి పోతున్నాయి అవి ఎప్పటికప్పుడు తయారుకావు. అలాంటప్పుడు వాటి వాడకం విచ్చ విడిగా ఉండవచ్చా? పెట్రోలియం ఉత్పత్తుల వాడకం పరిశ్రమలందు, రవాణాయందు విపరీతంగా ఉంది.

2. దేశ అవసరాలకు తగ్గట్టు దేశంలో పెట్రోలియంలభించనప్పుడు పెట్రోలియం వాడకాన్ని తగ్గించటమో, పరిమితం చేయటమో చేయాలి అలా చేయకుండా, దాని వాడకాన్ని పెంచివేసే పరిశ్రమలకు ప్రోత్సాహం కల్గిస్తున్నది. ఏటా మోటారు వాహనాల ఉత్పత్తిని పెంచివేస్తూ, ఇంధ నం వాడకాన్ని ఎక్కువ చేస్తున్నది. వాహనాల రాకపోకలకు అనువైన రోడ్లను నిర్మించకపోవటం వల్ల, ఏటా 500 కోట్ల విలువైన ఇంధన నష్టం జరుగుతోంది.

3. ఏటా 30 లక్షల టన్నుల పెట్రోలియం ఉత్పత్తుల వాడకం పెరుగుతుండటంచే, వాటిని ఎక్కువగా కొని తేవల్సి వస్తున్నది. 1987-88లో క్రూడ్ ఆయిల్ మరియు పెట్రోలియం ఉత్పత్తుల దిగుమతి ఖర్చు 5,400 కోట్లు ఉండవచ్చని అంచనా.

4. విదేశాలలో పెట్రోలియం తక్కువ ధరకు లభించినపుడు, దేశంలో అమ్మేధర తక్కువగా ఉండాలి. కాని అలా అమ్మరు. పెట్రోలి యం వాడకాన్ని తగ్గించేందుకు, ధరలను పెంచడం మాత్రమే ఈ ప్రభు త్వానికి తెల్సు. బొగ్గుధరకాని వంటగ్యాస్ ధరకాని, పెరగటమేకాని నిల కడగా ఉండవు. పెట్రోలియం ఉత్పత్తుల ధరలను ఎప్పటికప్పుడు పెం చేస్తూ, రవాణాచార్జీలు సరకుల ధరలను పెరగనిస్తూ, ప్రజలపై పెనుభారం వేస్తున్న ప్రభుత్వం ఇది.

5. కొన్ని వందలకోట్ల ఘనమీటర్ల సహజ వాయువును, గత 25 సంవత్సరాలుగా వృధా చేసిన ప్రభుత్వం ఇది. ఇప్పుడు రోజుకి 60 నుంచి 70 లక్షల ఘనమీటర్ల గ్యాస్ వృధాకాబడుతోంది.

6. గనులవద్ద త్రవ్వబడిన బొగ్గును, సకాలంలో రవాణాకూడా, చేయించలేని ప్రభుత్వం ఇది. బొగ్గును చౌకగా లభింపచేయటంకాని,బొగ్గును సక్రమంగా పంపిణీ చేయటంకాని లేదు.

7. ఉక్కు కర్మాగారాలకు థర్మల్ కేంద్రాలకు నాణ్యతకలబొగ్గుకు బదులుగా, నాసిది రాళ్ళు సరఫరా చేయటంతో; ఉక్కు కర్మాగారాలలో థర్మల్ కేంద్రాలలో ఉత్పత్తి దెబ్బతింటోంది.

8. డీసెల్‌లోను ల్యూబ్రికేటింగ్ నూనెలలోను కల్తీలు జరగకుండా అడ్డుకోలేనందుచే; మోటారు వాహనాలకు నష్టం కల్గుతోంది.

9. నూనెశుద్ది కర్మాగారాలు ఆయిల్ కంపెనీలందు, భద్రతా నిబంధనలను సరిగా పాటింపజేయనందుచే; అగ్నిప్రమాదాలతో అపార నష్టము కల్గుతోంది. అగ్ని ప్రమాద భయంనుంచి, రేవులను సురక్షితం చేయడంలోను విఫలమయ్యింది.

10. అవినీతికర చర్యలను కప్పిపుచ్చుకొందుకు, పలుచోట్ల పలు రీతులలో నష్టాలు కల్గుతున్నాయి. బొగ్గునిల్వలను మండించి, మసిగామార్చటం వంటివి జరిగాయి. విదేశాల నుంచి టెండర్ల ద్వారా, కొనుగోలుచేసే ఆయిల్ ఒప్పందాల ద్వారా, నష్టాలు కల్గుతున్నాయి.

11. వంటగ్యాస్‌ను వినియోగదార్లకు అందించలేక పోతున్నది. కొత్తవారికి గ్యాస్ కనెక్షన్‌లు రాకపోవటం, ఉన్నవారికి సమయంలో గ్యాస్ అందక పోవటం, సిలిండర్లలోగ్యాస్ తక్కువగా ఉండటం, సిలిండర్లు ప్రేలటం, గ్యాస్ ప్రమాదాలు జరగటం వంటి దురవస్థలు తప్పటం లేదు.

12. ఏటా 250 మి. టన్నుల వంట చెఱకు కాల్చబడుతున్నప్పుడు, పొయ్యిలలో ఉష్ణం ఉపయోగపడే సామర్థ్యాన్ని పెంచవలదా? మామూలు వంట పొయ్యిలలో 90 శాతం ఉష్ణం వృధాగా పోతున్నది. 10 శాతమే ఉపయోగించుకోబడుతోంది. ఈప్రభుత్వ పాలనలో వంటచెరకు వాడకం నష్టదాయకంగా ఉంది.

13 గడ్డిగాదం పేడవంటివి, పొలాలకు బలం ఇచ్చే ఎరువుగాకాక; వంటచెఱకు క్రింద కాల్చివేయబడుతున్నాయి. ప్రజలు వంటచెరకు కోసం అవస్థలు పడుతున్నారు. వారికి సులభంగా చౌకలో అందే ఏర్పాట్లులేవు.

14. ఈ ప్రభుత్వం ఇంధన సంక్షోభానికి కారణం అవుతున్నదే కాని; ఇంధనాల కొరతను తీర్చేట్టి పథక రచనను చేపట్టలేము. ఇంధనాలను ఆదాచేసే ప్రక్రియలు ప్రవేశపెట్టబడలేదు. ప్రత్యామ్నాయ ఇంధన వనరులతో, ఇంధనశక్తిని వాడుకలోకి తేలేకపోయింది. ఈప్రభుత్వం ఇంతే. దాని పాలనే అసమర్థతతో కూడినది. ఇట్టి ప్రభుత్వాన్ని విడనాడేందుకే, స్వపరిపాలనా లక్ష్యాన్ని నెరవేర్చుకొందుకే,

మనకొక స్వంతపార్టీ మాదేశం.

# 21. విద్యుచ్ఛక్తి

1. ఈనాడు విద్యుత్ ఉత్పత్తి 3 విధాలుగా జరుగుతోంది. 1) జలవిద్యుత్ 2) థర్మల్ విద్యుత్ 3) అణువిద్యుత్. విద్యుత్ కేంద్రాలకు గల ఉత్పత్తిశక్తిలో 48 శాతం మాత్రమే వినియోగం ఉంది. విద్యుత్ కేంద్రాలు వాటి స్తోమతకు తగ్గట్టుగాకాక, తక్కువ విద్యుత్తును మాత్రమే ఉత్పత్తి చేస్తున్నాయి.

2. దేశంలోకల జలవనరులు, బొగ్గు నిలవలు ద్వారా: విద్యుత్ ఉత్పాదనకు అపార అవకాశాలు ఉన్నాయి. అయినా విద్యుచ్ఛక్తి గిరాకీకి తగ్గట్టు; ఉత్పాదన చేయలేనట్టి ప్రభుత్వం ఇది.

3. విద్యుత్ సౌకర్యాలుగల గ్రామాలు 60 శాతం మాత్రమే. దేశంలో ఖర్చు అవుతున్న విద్యుత్తులో 18 శాతం మాత్రమే, గ్రామీణ ప్రాంతాలకు సరఫరా కావించబడుతోంది.

4. చౌకగా కరెంటును అందించ లేకపోగా, ఎక్కువ చార్జీలు వసూలు చేస్తున్నారు. ప్రతిభలేని సాంకేతిక సిబ్బందివల్ల, యంత్రాలలో లోపాలవల్ల, ప్రభుత్వ అసమర్థత అవివేకంవల్ల; విద్యుత్ కేంద్రాల పని తీరు సరిగాలేదు. ఉత్పత్తి వ్యయం హెచ్చుతున్నది. ఏటా నష్టాలు కల్గుతున్నాయి.

5. థర్మల్ కేంద్రాలలో ఏర్పడుతున్న యాంత్రిక లోపాలవల్ల, నాసిరకం బొగ్గును పంపటంవల్ల, బొగ్గు రవాణాలో అలస్యంవల్ల; థర్మల్ విద్యుత్ ఉత్పత్తికి ఎక్కువ ఖర్చు అవుతున్నది.

6. విద్యుత్ కేంద్రాలకు గల ఉత్పత్తి శక్తిని వినియోగించలేకపోవడం, అదనపు ఉత్పత్తికై తగిన కృషి లేనందువల్ల; ఆర్థిక పురోభివృద్ధికి అవరోధం ఏర్పడింది. విద్యుచ్ఛక్తి కొరతలతో ప్రజలుఇబ్బందుల పాలవుతున్నారు.

7. విద్యుచ్ఛక్తిని పుష్కలంగా లభింప జేయవల్సినది లేకపోగా వేసవిలో కరెంటు సంఘరాలో, తరచూ కోతలు అంతరాయం పరిపాటి అయ్యింది. ఆకారణంగా పరిశ్రమలు అనుకొన్నమేర ఉత్పత్తి చేయలేక పోతున్నాయి. కొన్ని మూసివేయబడుతున్నాయి. శీతల గిడ్డంగులలో నిల్వ చేసిన కూరగాయలు పళ్ళు కుళ్ళిపోతున్నాయి. గొట్టపు బావులనుంచి నీరు తోడటం వీలుపడక, తోటలు మాడిపోతున్నాయి.

8. అనేక గ్రామాలకు ట్రాన్స్‌ఫార్మర్లులేవు. లోడ్‌నిబట్టి ట్రాన్స్‌ఫార్మర్లు ఇవ్వరు. సబ్‌స్టేషనులు ట్రాన్స్‌ఫార్మర్లు శక్తిని పెంచనందుచే, లోవోల్టేజిచే నష్టాలు కల్గుతున్నాయి. రైతుల మోటార్లు కాలిపోతున్నాయి.

9. హైఓల్టేజీవల్ల బల్బులు కాలిపోవడం, లోవోల్టేజివల్ల బల్బులు కొవ్వొత్తిలా వెలగటం జరుగుతోంది. ఓల్టేజిలో తేడాలు, కరెంటు సరఫరాలో లోపాలువల్ల; చిన్న పరిశ్రమలవారు రైతులు నష్టాల పాలవుతున్నారు.

10. కరెంటు కనెక్షన్‌లకై ధరఖాస్తులు పెట్టి, నెలల తరబడి ఎదురు చూస్తున్నా, కరెంటు ఇవ్వరు. కరెంటు ఇమ్మంటే స్తంభాలు లేవంటారు. తీగలు లేవంటారు, మీటర్లు ట్రాన్స్‌ఫార్మర్లు లేవంటారు.

11. సాంకేతిక నైపుణ్యంలేని వారిచే వైరింగు పనులు జరగటం వల్ల; ఇళ్ళు భవంతులు పరిశ్రమలందు వైరింగు లోపాలు ఏర్పడి, అగ్ని ప్రమాదాలు సంభవిస్తున్నాయి. కరెంటు స్తంభాలు షాక్ కొట్టడం, కరెంటు తీగలు తెగిపడి ఉండటంవల్ల, ప్రాణాలు పోవటం ఉంది.

12. ఎంతో రద్దీగా ఉండే రోడ్లపై కూడా వీధి దీపాలు ఉండటం లేదు. వచ్చేపోయే వారికి కానరాని చీకటి. తద్వారా ప్రమాదాలు కల్గుతున్నాయి.

13. నెలనెలా మీటరు రీడింగుల ప్రకారం బిల్లులు కట్టుకోకుండా; ప్రతినెలా శ్లాబ్ రేటు ప్రకారం ఎక్కువ తక్కువలు కట్టించుకొనటం, సంవత్సరం తర్వాత మొత్తం రీడింగు ప్రకారం వసూలు చేయటం వంటి అసమర్థ ప్రభుత్వంచే, వినియోగదార్లు ఎన్నో ఇబ్బందులకు గురవుతున్నారు.

14. మీటర్లు తనిఖీచేయరు. చెడిన వాటిని మార్చరు. సరిగా పని చేయని మీటర్లచే కొందరు ఎక్కువ కరెంటు బిల్లు కట్టాల్సివస్తే, ఆగిపోయిన మీటర్లచే కొందరికి తక్కువ బిల్లు వంటి అవకతవకలను తొలగించటంలేదు. పెద్ద పరిశ్రమల వారితో ఉండే లాలూచీవల్ల, కరెంటును దొంగచాటుగా వాడుకోవటం జరుగుతోంది. కరెంటు సరఫరా ఆగిపోతే, త్వరగా పునరుద్ధరించరు. మరమ్మత్తులుచేయరు. గ్రామాలలో లైనుమేన్‌లు హెల్పర్లు అందుబాటులో ఉండరు. విద్యుత్ సరఫరాలో లోపాలు గూర్చి, వాడకందార్ల ఇబ్బందులగూర్చి పట్టించుకునే వారులేరు. అడుగడుగునా విద్యుత్ అధికార్ల నిర్లక్ష్యం. ఈ ప్రభుత్వం పనితీరుకు, ప్రజలలో నిరాశ నిస్పృహ. పాలనా సామర్థ్యంలేని ఈ ప్రభుత్వం ఎందుకు ఉన్నట్లు? కావలదా చైతన్యం. స్వపరిపాలనోద్యమ పురోగాము లయ్యేందుకే,

మనకొక స్వంతపార్టీ మాదేశం

# 22. కాలుష్యాలు

1. పరిశ్రమలు వస్తూత్పత్తినేకాదు, కాలుష్యాలను ఉత్పత్తి చేస్తు న్నాయి. వేలాది పరిశ్రమలు వదిలిపెట్టే పొగలు, రద్దు, మురుగు, షడ్డి వంటి వ్యర్థ పదార్థాలలోను—లక్షలాది వాహనాలు వదిలిపెట్టే పొగలోను— రకరకాల విషరసాయనాలు ఉంటాయి. అవిగాలిలోకి చేరి వాతావరణాన్ని, నీటిలోకి చేరి, నీటి వనరులను కాలుష్య పరుస్తున్నాయి.

2 రసాయన పరిశ్రమలలో దాదాపు 30వేల రసాయన పదార్థాలు తయారవుతున్నాయి. వాటిల్లో అధికశాతం విషప్రభావం కలవి. పారిశ్రామిక రసాయనాలు గాలిలోకిచేరి, విషప్రభావంగల రసాయనాలుగా మారు తున్నాయి. పెట్రోలియం బొగ్గు కట్టెలు వంటి ఇంధనాలను మండించిన పుడు, విషవాయువులు వెలువడుతాయి.

3. పరిశ్రమల నుంచి వెలువడే చమురులు ఆమ్లాలు, పొలాల్లో చల్లే ఎరువులు, క్రిమిసంహార మందులు కల్సిన మురుగు, ఇళ్ళనుంచి వెలు పడే మురుగు, చెత్తా చెదారం పెంటపోగులువల్ల; కాలువలు నదులు సముద్రాలలోక కాలుష్యంచేరింది. అనేక రకాల కలుషిత పదార్థాలు, సము ద్రాలలో కలిపివేయబడుతున్నాయి.

4. నీటి కాలుష్యంవల్ల నదులు సముద్రాలలోని చేపలు చనిపోతు న్నాయి. అవి విషపూరితం అవుతున్నాయి. అంతర్జలంలోకి కాలుష్యంచేరి, అవి త్రాగేందుకు పనికిరావటంలేదు.

5. పట్టణనగరాలంతటా కాలుష్యం ఏస్థాయికి పెరిగిందంటే; ప్రాణా వసర గాలి పీల్చేందుకు, నీరు త్రాగేందుకు భయపడాల్సినంతగా. విషరసా యనాలు కల్సిన గాలివల్ల, నీటివల్ల; శరీర అంగాలు తెలియని రోగాలకు లోనవు తున్నాయి. కాలుష్య నివారణకై పార్టీ ప్రభుత్వం నిర్దిష్టచర్యలు గైకొనక పోవటంతో, వాతావరణము, నీటి వనరులు, నేల కలుషితమై

పోయాయి. రాబోయే తరాలు దుష్ఫలితాలతో, బ్రతకలేక బ్రతకాల్సి ఉంటుంది.

6. ప్రకృతి పరిసరాలు ఎంత స్వచ్ఛమైనవి? నాగరికత అభివృద్ధి, పారిశ్రామికీకరణ పేరిట; మన స్వచ్ఛంద వనరులు ఎంతగా కాలుష్య పర్చబడినవో కదా! గాలి నీరు మట్టి కాలుష్యాలతో నిండిపోతే, వాటిని ప్రమాద రహితం చేయటం ఎంతటి క్లిష్టమో, కష్టమో కదా?

7. కాలుష్యాలవల్ల రోగాలు పెరగటం, రకరకాల రోగాలకు గురవ్వటం జరుగుతోంది. ప్రజల పశుపక్ష్యాదుల ఆరోగ్యం క్షీణించుతోంది వృక్ష సంతతి ఆహారోత్పత్తి దెబ్బతింటున్నది. ప్రకృతి సంపదకు నష్టం వాటిల్లుతోంది.

8. పార్టీల పాలనలో ధ్వనిస్థాయి ప్రమాదకరంగా పరిణమించింది. చెవులు భరించలేనంతగా కర్ణకఠోర ధ్వనులు సాధారణం అవటంచే, మనశ్శాంతి కరువై పోతున్నది. ఏకాగ్రత లోపిస్తున్నది. వయస్సు పెరిగే కొలదీ, వినికిడిశక్తి తగ్గుతూ ఉంది. ఎందరో చెవిటి వారవుతున్నారు. ధ్వని కాలుష్యంచే వ్యాధులు కల్గుతున్నాయి. ఏటా చిన్నా పెద్దా పరిశ్రమలు పెరుగుతున్నాయి. రైళ్ళు విమానాలు వాహనాలు పెరుగుతున్నాయి. ఈ స్థితిలో పెరుగుతూపోయే ధ్వని కాలుష్యాన్ని పెరగనీయకుండా, అదుపు చేసే శక్తికల ప్రభుత్వం లేదే!

9. ప్రజల ప్రాణాలపై ప్రజల ఆరోగ్యకర పరిస్థితులపై,ఎట్టి శ్రద్ధాసక్తులు లేనట్టి పార్టీ ప్రభుత్వాల పాలనలో; రాజకీయ అవినీతిలా, పరిసరాలలో కాలుష్యాలు చేరిపోయాయి.

10. గాలిని పీలిస్తే నీటిని త్రాగితే; మనుష్యులకు పశువులకు రోగాలు వచ్చే రీతిలో, పైరుపంటలు దెబ్బతినెడి రీతిలో, కాలుష్య ప్రమా

దం విరుచుకు పడినా, ఈపార్టీ ప్రభుత్వాలకు పట్టడంలేదు.

11. ఎక్కడ ఏ పరిశ్రమలు స్థాపించకూడదో, అక్కడ ఆ పరిశ్రమలు-ఏయే పరిశ్రమలు ఒకేచోట ఉండకూడదో అట్టివి పనిచేయటం. పరిశ్రమలు నెలకొల్పకూడని చోట వాటి స్థాపన- అనుమతి పొందకుండా నడుస్తున్న ఫ్యాక్టరీలు, ఇవన్నీ ప్రజారోగ్యాన్ని భంగకరంగా దెబ్బతీస్తున్నాయి.

12. ఈ ప్రభుత్వం అనుమతించే కాలుష్య పరిమితియే ఎక్కువ. ఆపరిమితినైనా పరిశ్రమలు వాహనాలు పాటించేట్లు చర్యలు గైకొనలేదు. ప్రభుత్వ ప్రవేటు పరిశ్రమలు కాలుష్య నివారణ పద్ధతులను అవలంభించడంలేదు. కాలుష్యాలు పరిమితికి మించి, గాలిలోకి నీటిలోకి నిరంతరంగా చేరుతున్నాయి. ఈ ప్రభుత్వం ఏటేటా పెరిగే కాలుష్యాలను అదుపుచేయలేకున్నది. ఇట్టి పార్టీల పాలన ఇంకెంత కాలం? మరి మీరంతా ఉద్యమించి, స్వపరిపాలనను సాధించుకునేందుకే

మీకొక స్వంతపార్టీ మాదేశం

# 23. ప్రకృతి పరిసరాలు

1. అడవులు క్షీణించటంచే, అడవులచే కల్గు ప్రయోజనాలు తరిగి పోతున్నాయి. ప్రకృతి పరిసరాలలో సమతుల్య స్థితిని కాపాడటంకన్నా; తమ ప్రభుత్వ ఆదాయాన్ని పెంచుకోవడం కోసమూ, పారిశ్రామికుల కంట్రాక్టర్ల వ్యాపార ప్రయోజనాల కోసమూ, ఈ ప్రభుత్వం పనిచేస్తోంది అటవీ సంరక్షణపట్ల శ్రద్ధాసక్తులులేని పార్టీ ప్రభుత్వం ఇది.

2. ఇదివరలో అడవులు 7కోట్ల 48 లక్షల హెక్టార్లు అంటే 23 శాతం ఉండగా, నేడు అవి 3కోట్ల 3 లక్షల హెక్టార్లకు తగ్గిపోయాయి. పారిశ్రామిక ముడిసరకు కలప వెదురు కొరకు, వంటచెరకు గృహసామగ్రి కొరకు, సాగుభూమికొరకు, తదితర అవసరాలకై - 45 లక్షల హెక్టార్ల అడవులు నరికివేయబడ్డాయి. ఏటా 3 లక్షల హెక్టార్ల అటవీ ప్రాంతాన్ని కోల్పోతున్నాం.

3. అవినీతి పరులైన రాజకీయవాదులు, అధికార్లు, అక్రమ ఆర్జన చేసే కంట్రాక్టర్లు, ఈ ప్రభుత్వ పాలనలో ఉండటంచే; అడ్డూ అదుపూ లేకుండా నిరంతరంగా చెట్లను పడగొట్టడం కొనసాగుతోంది. కలప దొంగ రవాణా సాగిపోతున్నది. అడవులు క్షీణిస్తున్నాయి. ఆకారణంగా పరిసర వాతావరణం తారుమారు అవుతున్నది.

4. నేలలు తేమను కోల్పోనివ్వని రీతిలోను, నీటివనరులు మృగ్యం కాకుండాను, వృక్షజాలం కాపాడుతోంది. అడవులు వాననీటిని పీల్చుకొనటము, ఒడ్డుకొనటమువల్ల; నీటి ప్రవాహాలు అదుపులో ఉంటాయి. అడవులు క్షీణించటంచే; వర్షపునీరు, వరదనీటిని అడ్డుకొనే అమరిక దెబ్బ తింది. ఫలితంగా వరదలకు గురయ్యే ప్రాంతాల విస్తీర్ణం పెరిగింది.

5. అడవుల విధ్వంసంవల్ల, గాలిలోకి చాలినంతగా ఆక్సిజన్‌ను చేర్చే, సహజ ప్రక్రియ దెబ్బతింది. వర్షపాతంలో మార్పులు వచ్చి,

వర్షాలు పడటం లేదు. ఏటావచ్చే రుతువులలో అవకతవకలు ఏర్పడ్డాయి. ఉష్ణోగ్రత పెరిగిపోతున్నది.

6. నదీ ప్రాంతాలలో అడవులు క్షీణించటంచే; నేలకోత జరిగి మట్టి కొట్టుకుపోయి, నదులలోను ఆనకట్టలవద్ద రిజర్వాయర్లలో మట్టి పేరుకు పోతున్నది. ఆకారణంగా రిజర్వాయర్లలో, నీటిని నిల్వచేసేశక్తి తగ్గిపోతున్నది. పూడిక పేరుకొనటంచే నదులు పొంగి, ప్రక్కనగల ప్రాంతాలను ముంచి వేస్తున్నాయి.

7. గాలులను వర్షాన్ని అడ్డుకునేందుకు అడవులు లేకుంటే, మట్టి కొట్టుకుపోయి రాళ్ళు రప్పలు మిగులుతాయి. అడవుల విధ్వంసంచే, వర్షపు నీరు వరదలువల్ల, ఏటా కోట్లాది టన్నుల సారవంతమైన మట్టి కొట్టుకు పోతున్నది. యుగ యుగాల పరిణామ క్రమంలో ఏర్పడిన భూసారాన్ని కోల్పోతున్నాం.

8. అటవీ ప్రాంతం తగ్గటంచే; నేడు ఉన్న పరిశ్రమలకు ప్రజలకు చాలినంతగా, అటవీ ఉత్పత్తులు లభ్యంకాని పరిస్థితి ఎదురైంది.

9. ప్రస్తుత అనావృష్టికి, అతివృష్టికి, కరవుకాటకాలకు-కారణం అడవుల విధ్వంసమే. వరదలూ, ఆహార ఇంధన కొరతలూ ఏర్పడే స్థాయికి; అడవుల ధ్వంసం చేరుకొంది. చట్టబద్ధంగాను చట్ట విరుద్ధంగాను చెట్లను పడగొట్టేస్తున్నారు. కొట్టివేయబడే చెట్ల నిష్పత్తిలో, కొత్తగా చెట్లను పెంచటంలేదు. అడవులు క్షీణించి వాటిస్థానే, ఎత్తుపల్లాలు దిబ్బలు ఏర్పడ్డాయి. అటవీ విధ్వంసంవల్ల కలిగే నష్టాలు గుర్తించకుండా; ఈపార్టీ ప్రభుత్వాలు మానవ మనుగడకే ముప్పు వాటిల్లే, భయానక పరిస్థితులను సృష్టిస్తున్నాయి. ఏమిటిలా ఉంది, ప్రభుత్వ పాలన? మనకు కావాలి, స్వపరిపాలన. అందుకే

మీ కొరకు మీకొక స్వంతపార్టీ మాదేశం.

# 24. టెలిఫోన్

1, టెలిఫోన్ వ్యవస్థను నిర్దిష్టంగా తీర్చిదిద్ద నందువల్ల, ఎంతో వెనుకపడి ఉన్నాం. ఆకారణంగా టెలిఫోన్ల పనితీరు నిస్పృహకల్గిస్తోంది.

2. ఎక్స్చేంజి యంత్రాలన్నీ పాతబడ్డాయి. టెలిఫోన్ మీటర్లు తప్పుగా తిరుగుతాయి. ట్రంకాల్ చేయాలన్నా, బుక్ చేసిన కాల్ రద్దు చేయాలన్నా కష్టం. ఎస్. టి.డి సౌకర్యంతో తప్పుడు బిల్లుల భారం పడుతోంది.

3. ఫోన్లు సక్రమంగా పనిచేసేట్టు చూడరు. ఫోను చార్జీలు విపరీతంగా పెంచబడ్డాయి. ఫోన్ వాడకం దార్లపై తప్పుడు బిల్లులు వేసి పీడిస్తున్నారు.

4. ఫోన్ కనెక్షన్‌కై పెద్ద మొత్తాలలో డిపాజిట్టు చేయమంటారు కనెక్షన్ ఎప్పటికి వస్తుందో తెలియదు. వాడకందార్ల ఫిర్యాదులు అనేకం. వాటిని పరిష్కరించరు. టెలిఫోన్ సౌకర్యాలు సామాన్యులకు అందుబాటులో లేవు. ప్రభుత్వ వైఫల్యాన్ని ఎంతకాలం ఉపేక్షిస్తూ ఊరకుంటారు? ఇప్పటికైనా ప్రజలకొరకు,

స్వంతపార్టీ మాదేశం ఉంది మేల్కొనండి.

# 25. సినీ పరిశ్రమం

1. దేశ ప్రజల వినోదానికి వారి విజ్ఞానం పెంపుదలకు ఉపయో గించాల్సిన సినిమా; నిర్మాతల దర్శకుల ఫైనాన్సియర్ల చేతుల్లో సామాజిక శ్రేయస్సును వదిలి, వినాశనం దిశగా పయనిస్తున్నది. పెట్టుబడులు లాభాల ఆర్జన దృష్టితో, ప్రజా సంక్షేమం కాలరాచి వేయబడింది.

2. దేశంలో 76 స్టూడియోలు ఉన్నాయి. ఒక సినిమా తీసేందుకు 20 లక్షల నుంచి 3 కోట్లవరకూ ఖర్చుచేస్తున్నారు. ఏడాదికి సగటున 920 దాకా చిత్రాలు నిర్మించబడుతున్నాయి. దేశవ్యాప్తంగా పర్మినెంట్ థియేటర్లు 7వేల 775 ఉన్నాయి. టూరింగ్ థియేటర్లు 4700దాకా ఉన్నాయి సినీ పత్రికలు 621 దాకా ఉన్నాయి. చలనచిత్ర పరిశ్రమకు సంబంధించి చలామణిలోఉన్న మొత్తం పెట్టుబడి, 3వేల కోట్లకు పైగా ఉంది. 20 లక్షల మందికి జీవనోపాధి లభిస్తోంది. ప్రతిరోజూ సినిమాలనుచూసే ప్రేక్షకుల సంఖ్య సుమారు కోటి 25 లక్షలు. అలాంటి సినీ పరిశ్రమ ప్రేక్షకులపై కల్గిస్తున్న ప్రభావం ఏమిటన్నది పట్టించుకోని పార్టీ ప్రభుత్వాలివి.

3. ఇతివృత్తాలు మాటలు పాటలు సన్నివేశాలు పోష్టర్లు ప్రకట నలు వంటివన్నీ; ఈ సమాజం యొక్క నైతిక విలువలను దిగజార్చేలా, ప్రజల సంస్కృతిలో అసభ్యత నెలకొల్పేలా, బాధ్యతా రాహిత్యం ప్రబ లించేలా, అరాచకం వైపు మరలించేలా ఉన్నాయి.

4. స్త్రీని విలాసంగా భోగంగా సెక్సు సంబంధ విషయ వాంఛలను రేపేలా మార్చారు. నటీమణులు సిగ్గును మరచి, బట్టలు లేకున్నా నటించేలా మార్చబడ్డారు. ఇంటా బయటా సిగ్గుపడేలా చిత్రీకరిస్తున్న దృశ్యా లెన్నో? అర్ధనగ్న దృశ్యాలు లైంగిక వాంఛలను రేపుతున్నాయి. అక్రమ సంబంధాలను ప్రోత్సహిస్తున్నవి. వ్యభిచారం పెరుగుతోంది. అత్యా చారాలు పెరుగుతున్నాయి.

5. సమాజంలో నేరాలు పెరుగుతున్నాయి. చట్ట విరుద్ధమైన చర్యలకు పాల్పడుతున్నారు. హింసా ప్రవృత్తి పెరుగుతోంది. దొంగతనాలు దోపిడీలు ఎక్కువ అవుతున్నాయి. ఆవేశకావేషాలు దౌర్జన్యం పగ హింస ప్రతీకారం చెలరేగు తున్నాయి.

6. ప్రజానీకం యొక్క విలువలలో అలవాట్లలో నడతలో ప్రవర్తనలో-చెడు ప్రబలుతోంది. చెడు సాంప్రదాయాలకు లోనవుతున్నారు. ప్రజల బుద్ధి వక్రీకరించబడుతోంది.

7. తిండి నిద్రకన్నా కూడా ఈ సినిమాల వ్యాపకం పెరిగింది. పత్రికలలో రోజూ వ్యాపార ప్రకటనలు. రోడ్లకు ఇరువైపులా గోడలపై అసభ్యకర పోస్టర్లు. గ్రామపట్టణా లంతటా రోజల్లా సినిమా పాటలు. సినిమా వ్యసనంగా మార్చబడింది. ప్రజల శ్రమ కొల్లగొట్ట బడుతోంది. నీతి నియమాలు మంటకలిసేలా, అసభ్య ధోరణులకు ప్రేరకంగా, దుష్ఫలితాలు కల్గిస్తుండేలా, సినీపరిశ్రమ నడపబడుతోందంటే; దానికి కారణం ఈపార్టీ ప్రభుత్వాలే. దాని పాలనా దుష్ఫలితాల నుంచి విముక్తికే. ప్రజలు స్వపరిపాలనా కర్తవ్యం వైపు మరలేందుకే,

తపకొాక స్వంతపార్టీ మాదేశం.

# 26. ఆర్థిక రంగం

1. ఆర్థిక రంగం అంటే; డబ్బుకు సంబంధించినది- అభివృద్ధికి సంబంధించినది- ఆదాయాలకు సంబంధించినది-ఖర్చులకు సంబంధించినది.

| | |
|---|---|
| 2. ప్రతి వ్యవస్థలో అభివృద్ధిని వ్యవస్థలన్నింటిలో అభివృద్ధిని | ఆర్థికాభివృద్ధిగా వ్యవహరిస్తాం. |

## 1. ప్రణాళికలు

3. 1950లో ప్రణాళికా రచన ఆరంభమై, 1951 నుండి పంచవర్ష ప్రణాళికలు చేపట్టబడ్డాయి. ప్రణాళికల రూపకల్పనలో, వాటి అమలులో, అవకతవకలు వల్ల ప్రజల వాంఛితార్థం నెరవేరలేదు. సాధారణ ప్రజ సుఖశాంతులు కోల్పోయేట్లు, ప్రభుత్వం లోపభూయిష్టమైన ప్రణాళికా విధానాలను అనుసరిస్తోంది.

4. ప్రణాళికా విధానాలలో పథకాలలో, పార్టీ రాజకీయవాదుల జోక్యం పెరిగి; ప్రణాళికల అమలులో ఉత్పత్తి లక్ష్యాలను చేరుకోవడంలో, వైఫల్యాలు ఎదురయ్యాయి ఎదురవుతున్నాయి.

5. స్థానిక వనరులను మానవశక్తిని వినియోగించుకోవటంలో వైఫల్యం చెందారు. వ్యవసాయ ఉత్పత్తుల సమృద్ధికి ప్రాధాన్యత ఇవ్వకుండా, పారిశ్రామికీకరణకు గైకొన్న చర్యలవల్ల, ఆర్థిక సమస్యలు పెరిగాయి. ప్రభుత్వ యంత్రాంగం, దేశ ఆర్థిక వ్యవస్థను భ్రష్టు పట్టించారు.

6. రాష్ట్రంయొక్క ఆర్థిక పారిశ్రామిక వెనుకబాటు బట్టిగాని, జనాభా అవసరాలను బట్టిగాని, క్రొత్త ప్రాజెక్టుల కేటాయింపు జరగటం లేదు. కేంద్ర ప్రభుత్వం పక్షపాతవైఖరి నవలంభిస్తూ- ముఖ్యమైన

ప్రాజెక్టులను, అదనపు ప్రణాళికా సహాయాన్ని, కొన్ని రాష్ట్రాలకు కేటాయిస్తోంది.

7. విద్యుత్ నీటిపారుదల వరదనివారణ వంటి రంగాల్లో: పాత ప్రాజెక్టుల నిర్మాణం పూర్తికాకుండా కొత్తవాటిని ఆరంభించడంచే- కొత్త పాత వాటి పనులు చేపట్టడానికి కావల్సిన నిధులు తదితర సామగ్రిలేక వేటి పనులు సవ్యంగా సాగక, ఏవీ పూర్తి కావటంలేదు. ఇలాంటి జాప్యంతో నిర్మాణ వ్యయం ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోవటం- తదుపరి అవి పూర్తి అయ్యేందుకు, వాటినుంచి ఫలితాలు అందేందుకు-దీర్ఘ కాలం పడుతున్నది.

8. ఆధునిక పారిశ్రామికీకరణకు ఆయువుపట్టు అయిన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాలను, అవసర స్థాయిలో సైతం పెంపొందించుకోనందు వల్ల, విదేశాలపై ఆధారపడక తప్పింది కాదు.

9. ప్రణాళికా విధానాలకు, కార్యక్రమాలకు సంబంధంలేకుండా ఉంది. ప్రజల సమస్యలను తాత్కాలికంగా దాటవేస్తున్నారు. సమస్యలను తొలగించేందుకు, దీర్ఘ కాలిక కార్యక్రమాలను చేపట్టడంలేదు.

10. ఇంతవరకు ప్రణాళికలపై 3 లక్షలకోట్లు ఖర్చుచేయబడినా: వ్యవసాయంలోనేగాక, ఇరిగేషన్, డ్రైనేజి, విద్యుత్, గృహనిర్మాణం, ఎలక్ట్రానిక్స్, కమ్యూనికేషన్స్, మేనేజిమెంటు, ఉపాధి, పరిశోధనలు, ఇలా అన్ని రంగాలలో వెనుకబడే ఉన్నాం. ఎందుకిట్టి పాలనా సామర్థ్యం లేని ప్రభుత్వాన్ని అంగీకరిస్తున్నారు?

## 2. ఆదాయ వ్యయాలు

1. ప్రభుత్వానికి ఆదాయం ఈ క్రింది విధంలో వస్తోంది. 1) ప్రభుత్వ ఆస్తులుగా ఉన్న పరిశ్రమలు గనులు అడవులు ద్వారా, తపాలా కమ్యూనికేషన్లు విద్యుత్ కట్టడ నిర్మాణాలు వంటి సేవా సంస్థల

11)

ద్వారా, ప్రభుత్వ వర్తక వాణిజ్యం బ్యాంకింగ్‌ద్వారా 2) పరోక్షప్రత్యక్ష పన్నులు విధించడంద్వారా 3) ధరలను పెంచడంద్వారా 5)లోటుబడ్జెట్లతో డబ్బును ముద్రించడంద్వారా 5) స్వదేశీ విదేశీ అప్పుల ద్వారా, ప్రభుత్వం ఆదాయాన్ని రాబట్టుకుంటోంది.

2. ప్రభుత్వ ఆదాయం రెండు విధాలుగా ఖర్చవుతోంది. 1)ప్రణాళికా వ్యయం:- ఉత్పత్తి ఉపాధి సౌకర్యాలు పెరిగేరీతిలో; వ్యవసాయ పారిశ్రామిక సేవారంగాలను అభివృద్ధిచేస్తూ, తద్వారా ఆర్థిక వ్యవస్థను పటిష్టవంతం చేస్తుందేది ప్రణాళికా వ్యయం. 2) ప్రణాళికేతర వ్యయం:- ఇది అభివృద్ధికి సంబంధం లేనట్టిది. పరిపాలనా యంత్రాంగంకై ఖర్చు, రక్షణ నిమిత్తం చేసే ఖర్చు, ప్రభుత్వ సంస్థల నష్టాలను భర్తీచేసేఖర్చు సబ్సిడీల ఖర్చు, అప్పుపై వడ్డీలు వంటివి ప్రణాళికా సంబంధంలేనిఖర్చు.

3. ప్రణాళికేతర వ్యయం;-ఆదాయంలో 68 శాతందాకా ఉంటున్నది. రాష్ట్రాల ఆదాయంలో 50నుంచి 70 శాతం దాకా, ఉద్యోగుల జీతభత్యాలకే ఖర్చయిపోతున్నది.

4. బడ్జెట్ అంటే ఆదాయ వ్యయాలు. ఆదాయంకన్నా ఎక్కువగా ఖర్చుచేస్తే, బడ్జెట్‌లో లోటు ఏర్పడుతుంది. అది లోటుబడ్జెట్. ఆదాయంలో ఖర్చులు పోను మిగులు ఉంటే, అది మిగులుబడ్జెట్.

5. ఆదాయంలో 80 శాతం పరోక్షపన్నులద్వారా వస్తోంది. పన్నులు వేస్తూ ఆదాయాన్ని పెంచుకొనే ప్రభుత్వాలేకాని; ఖర్చుచేసే ఆదాయం ద్వారా, ప్రజలకు సత్ఫలితాలను అందించలేనివి. ఆదాయం ఖర్చవుతుంటే; అభివృద్ధి జరిగి, ధరలు తగ్గటం, ఇతర సదుపాయాలు ఏర్పడటం జరగాలి అదిలేదు.

6. ఆదాయాన్ని ఖర్చుచేయటంలో అసమర్థత అవినీతివల్ల; ఆర్థిక వనరులు ప్రయోజనకరం కాలేదు. ప్రభుత్వ పరంగా జరిగిన వ్యయంలో 40 శాతందాకా: బహుళజాతి సంస్థలు, కంపెనీలు, వాణిజ్య వ్యాపార

వర్గాలు, చట్టావ్యాపారులు, బడాకంట్రాక్టర్లు, పన్ను ఎగవేతదార్లు, లైసెన్సుదార్లు, పర్మిట్ల కోటాలదార్లు, మధ్యదళారీలు, ఉన్నతాధికార్లు, రాజకీయ నాయకుల జేబుల్లోకి పోయింది.

7. వ్యవసాయం వైద్యం విద్య రవాణావంటి ప్రధానరంగాలకు, డబ్బు ఖర్చు చేసేందుకు వెనుకంజ వేస్తారుగాని-సంక్షేమ కార్యక్రమాల పేరట మాత్రం ఆదాయాన్ని దుబారా చేస్తున్నారు. ప్రభుత్వానికివ్యయమే తప్ప ఆదాయం ఇవ్వని పథకాలకై, తమ స్వంత ప్రయోజనాలకై: ఆదాయాన్ని దుర్వినియోగపరుస్తున్న పార్టీల ఓట్ల ప్రభుత్వం ఇది.

8. రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్రప్రభుత్వము ఎడాపెడా పన్నులను పెంచేస్తూ, ప్రజలను బ్రతకనిచ్చేట్లు లేదు. రైలు, బస్సు, విద్యుత్ చార్జీలు బొగ్గు, కిరోసిన్, వంటగ్యాస్, సిమెంటు, కాగితం, దుస్తులు, చెప్పులు, టూత్ పేస్టు, సబ్బులు, పాలు, నూనెలు ఇలా ఏవితీసుకున్నా: వాటి ధరలు అపరిమితం. ఇంకా చిత్రవిచిత్రమైన పన్నుల విధింపుతో, పన్నుల ద్వారా పీడించే పరిపాలన ఇది. ఇది పన్నుల ప్రభుత్వం. ఎప్పుడు వేటి ధరలను పెంచుతుందో తెలియదు.

9. ప్రజలు చెల్లించే పన్నులను సవ్యంగా ఖర్చుచేసి ఉంటే: ప్రజల ఎన్నో అవసరాలు సులభంగా నెరవేరు తుండేవి. వెనుకబడిన ప్రాంతాలు వెనుకబడి, పేదరాష్ట్రాలు పేదగా ఉండేవి కావు.పట్టణనగరాలు మరింత పట్టణనగరీకరణతో క్రిక్కిరిసిపోయేవికావు. పెట్టుబడులులేక; నేడు భావితరాలకు ఉపయోగపడే భారీప్రాజెక్టులు, వదిలివేయ బడేవికావు. భారీ పరిశ్రమల ప్రాజెక్టుల పనులు, పూర్తికాకుండా ఉండేవికావు. రోడ్లు, వంతెనలు, రైలుమార్గాల, ఆధునికీకరణ వంటివి ఆగిపోయేవికాదు. నేటికి నీటి సదుపాయాలు-రోడ్లు-వీధిదీపాలు- పోస్టాఫీసులు- కరెంటుసరఫరా- పాఠశాలలు-ఆస్పత్రులు-బస్సు సౌకర్యం-పారిశుధ్యపు ఏర్పాట్లులేని ఎన్నెన్నో గ్రామాలు, 40 సంవత్సరాల పరిపాలన తదుపరి ఉండేవి కావు.

10 ఈ పార్టీ ప్రభుత్వాలు దేశంలోని వనరులను వ్యర్ధం చేస్తుండబట్టే; ప్రపంచంలో అగ్రస్థాయిలో ఉండాల్సిన భారత దేశం, బీదదేశంగా మిగిలిపోయింది. ఇంకా ఇంకా ఇట్టి అసమర్ధ ప్రభుత్వానికా పాలనాధికారం?

# 3. అప్పులు

1. ప్రణాళికల అమలు లేదా ప్రాజెక్టుల నిర్మాణము లేదా పరిశ్రమలు పెంపుదలలేదా సౌకర్యాల కల్పన లేదా ప్రకృతి వైపరీత్యాల నుండి పునరుద్ధరణ వంటి వాటి నిమిత్తమై, ఈ ప్రభుత్వం దేశీ విదేశీ అప్పులు చేస్తున్నదా? లేదు. అప్పును....అప్పులతో చెల్లిస్తూ - అప్పులను పొడిగించుకుంటూ పోయేందుకు. ఈ కారణంగా అప్పులు ఏయేటా తరుకుతూ, ఏయేటా పెరుగు తున్నాయి.

2. దేశీయమైన అప్పు అంతా ప్రజల పొదుపు. చిన్న మొత్తాల పొదుపు-ప్రావిడెంట్ ఫండ్-బాండ్లు మరియు 15 ఏళ్ళ సర్టిఫికెట్లు ప్రత్యేక డిపాజిట్లు పథకాలు-రైల్వేలు తంతితపాలా వంటి రిజర్వు నిధులు మొదలగు వాటిద్వారా, ప్రభుత్వానికి దేశీయ అప్పు లభిస్తోంది.

3. దేశీ అప్పులు చెల్లించేది రూపాయలలో కాబట్టి, ఎలాగో లాగ తీర్చవచ్చు. పన్నులు పెంచి, ధరలు పెంచి, నోట్లు ముద్రించి-అలావచ్చిన ఆదాయంలో నుంచి అప్పు తీర్చవచ్చు. మరిఆదాయం ఖర్చులకే సరిపోవడం లేదు. ఏటా వడ్డీలు చెల్లించడమే కష్టంగాఉంది.ఇక ఈప్రభుత్వం అసలును ఎలా తీర్చగలదు? ఈ పార్టీ ప్రభుత్వం దివాళా తీసిందని బకాయిలు తీర్చ లేదని మొండికేయటం తప్ప, ఈ ప్రభుత్వంచే ప్రజలు దగా చేయబడటం తప్పితే, ఇంకేమి జరుగగలదు? ఇదేమైన తక్కువ అప్పా? ఈమార్చి వరకు దేశంలో చేసిన అప్పు లక్ష 70 వేల 834 కోట్లు. ఇందుకై చెల్లిస్తున్న వడ్డి 10 వేల 416 కోట్లు. ఏటా ప్రభుత్వం, చేసే అప్పులో, మూడింట రెండవంతులు వడ్డీ చెల్లింపులకే ఖర్చవుతోంది.

## విదేశీ అప్పు

4. మనం అమ్మే సరుకుల ధరలు తక్కువగాను, మనం కొనుగోలు చేసేవాటి ధరలు ఎక్కువగాను ఉంటున్నాయి. విదేశ మార్కెట్లోని పోటీని తట్టుకోలేని కారణంగా, కొన్ని వస్తువులను నష్టాలకే అమ్ముతున్నారు. ఆనష్టం ఎగుమతి సబ్సిడీలు ద్వారా భర్తీ చేయబడుతోంది.

5. వ్యవసాయోత్పత్తులు పునః సృష్టి అవుతాయి కాబట్టి, వ్యవసాయాధార వస్తువులు ఎంతగానైనా అమ్ముకొనవచ్చు. పరిశ్రమలకు మూలాధారమైన, వేర్వేరు ముడి ఖనిజాలను అమ్మేసుకుంటే ఇంక అంతే. గనుల నుంచి త్రవ్వి తీస్తుంటే తరిగిపోతాయి. మరి కొన్నాళ్ళకు దొరకవు కూడా. అట్టి అపూర్వసంపద అయిన ఖనిజాలు భవిష్యత్తుకు దాచుకోవల్సినవి. ఈ ప్రభుత్వం ఏమో, వేగంగా అమ్మివేస్తూ, దేశ ప్రజలకు ద్రోహం చేస్తోంది.

6. దేశ ప్రయోజనాలను సైతం కాలరాచి చేస్తున్న ఎగుమతుల ద్వారా, ఆర్జించిన డబ్బునైనా, సద్వినియోగం చేస్తున్నదా? లేదు.

7. ఎగుమతులను పెంచేరీతిలో విధానాల అమలుకాని, దిగుమతులను తగ్గించుకునే రీతిలో పథకాల అమలుకాని లేవు. దేశంలో ఉత్పత్తి చేసుకోగలిగే యంత్రసామాగ్రి సైతం, దిగుమతి చేసుకోబడుతోంది. ఆర్థిక వ్యవస్థను దిగజార్చేరీతిలో దిగుమతులు ఉంటున్నాయి.

8. ఎన్నో ప్రాజక్టులు, పరిశ్రమలను సకాలంలో పూర్తిచేసి ఉంటే దిగుమతులకై ఇంత ఖర్చు ఉండేదికాదు. దిగుమతులు ఎక్కువ అవటంచే, ఎంతగా ప్రయత్నించి ఎగుమతులుపెంచినా ఫలితం లేకున్నది.

9. 1983 వరకు ధాన్యాలు ధాన్య ఉత్పత్తులు దిగుమతి అయ్యేవి. ఈ మధ్య వరకు సిమెంటు కూడా దిగుమతి అయ్యేది. 2) 1981-82లోను ఇటీవల తప్ప దేశావసరాలకు తగ్గ చక్కెర ఉత్పత్తి జరగలేదు. 1986 లో 18 లక్షలు 1987లో 9.97 లక్షల టన్నుల పంచదార దిగుమతి అయ్యింది,

చక్కెర నిమిత్తం ఏటా వందల కోట్ల ఖర్చు. 3) ఎరువుల దిగుమతి ఏటా వెయ్యి కోట్లకు పైగా ఖర్చవుతోంది. నాణ్యమైన పత్తి దిగుమతికి 100 కోట్లను చెల్లిస్తున్నాం. 4) వంట నూనెల కొరత ఈ నాటిది కాదు, గత 18 సం॥ నుంచి ఉంటున్నదే. ఏటా వెయ్యి నుంచి 1500 కోట్ల రూ॥ విలువచేసే వంట నూనెలు దిగుమతి అవుతున్నాయి. 5) ఎగుమతుల ద్వారా ఆర్జించిన డబ్బులో ఎక్కువశాతం క్రూడ్ ఆయిలు పెట్రోలియం ఉత్పత్తుల కొనుగోలుకే ఖర్చయి పోతున్నది. ఈమొత్తం 1986లో4 వేల 800 కోట్లు మోటారు వాహనాలు, రైళ్ళు, విమానాలు పెంచేసుకుంటూ, ఇంధన వాడకాన్ని పెంచేస్తుంటే, ఏటా ఎంతని కొనితేగలం? 6) న్యూస్ ప్రింట్‌లో అధిక భాగం దిగుమతి అవుతోంది. ఏటా 30 కోట్లు విలువచేసే రబ్బర్, 20 కోట్లు విలువైన ఎండుద్రాక్ష దిగుమతి అవుతోంది7) ఏటా 1100కోట్ల విలువైనఇనుము, ఉక్కు, పైపులు గొట్టాలు, ఫిట్టింగ్‌ల సామాగ్రిదిగుమతి అవుతోంది.

10 విదేశాల నుంచి వంటనూనెలను కాని, పత్తినికానిఎరువులనుకాని న్యూస్‌ప్రింట్‌నుకాని ఇలా కొన్నింటిని కొనటం శ్రేయ అనుకోండి.అప్పుడు ఆనిమిత్తం ఏమీఖర్చు లేనట్లు. వ్యవసాయాభివృద్ధికి కావల్సనన్నివనరుల ప్రకృతి సిద్ధంగా, ప్రసాదితమై ఉన్న భారతదేశం విదేశాల నుండి కొని దిగుమతులుచేసుకోవల్సి వస్తున్నదంటే,అదెంత సిగ్గుచేటు?

11 విదేశ వ్యాపారంలో కొనుగోలు అమ్మకాలకు, మన డబ్బుపనికి రాదు. కొనుగోలు అమ్మకాలు డాలర్లలో జరుగుతుంటాయి. బంగారం ద్వారా కూడా జరుపుకోవచ్చు. డాలర్లు లేదా బంగారం విదేశమారకం డబ్బు అన్నమాట.

12. విదేశ మారకం డబ్బును ఎగుమతులుచేసి ఆర్జిస్తేనే, కావల్సినవి కొనుక్కొని దిగుమతి చేసుకోగలం. ఎగుమతులు చేసి ఆర్జించిన విదేశ మారకం, మన దిగుమతులకు సరిపోనందుచే; విదేశ వ్యాపారంలోలోటు ఏర్పడుతున్నది. వ్యాపారలోటు చెల్లింపులకై, విదేశీ అప్పు చేస్తున్నారు

13. అప్పిచ్చిన దేశాలు మరియు ఆర్థిక సంస్థలు విధించే షరతు లన్నీ: వారి స్వలాభం, వారి ఆర్థిక ప్రయోజనాలకు చెందినవి కాని-మనం ఆర్థికంగా బాగుపడేందుకు కాదు. వాయిదాలలో అప్పును వడ్డీని రాబట్టుకోవ టమేగాక, ఇంకెన్నోరకాల లాభాలను పొందుతున్నారు. 1) వారు చెప్పిన ఎక్కువధరలకు వారినుంచే ముడిసరకులు యంత్ర సామగ్రిని తెప్పించు కొనాలి. 2) వారిసరకులను మనదేశంలోకి రానిచ్చి అమ్ముకోనివ్వాలి. 3) వారి దేశంలోని గుత్త సంస్థలకు, పరిశ్రమలను నెలకొల్పుకోనిచ్చి, లాభాలార్జించి కొనిపోయేందుకు అవకాశం కల్గించాలి.

14. తీసుకున్న అప్పును ఎందుకు వాడాలో-వేటి నిమిత్తం ఖర్చు చేయాలో-ఫలానా సామగ్రిని ఎవరివద్ద కొనాలో- ఎవరినుంచి సాంకేతిక సహాయం పొందాలో వంటి షరతులు విధిస్తున్నారు. ఇట్టివన్నీ మన రాజకీయ ఆర్థిక ప్రయోజనాలకు భంగకరమైనవి.

15. ఆర్థిక వ్యవస్థను పటిష్టపరచే రీతిలో, విదేశీ అప్పును వినియో గించలేదు. ప్రతి రూపాయి నుంచి ఆదాయం లభించే రీతిలో లేదా ఉత్పత్తికి దోహదపడే రీతిలో-ఖర్చుచేయాల్సిన విదేశమారకం డబ్బు, దుబారా దుర్వ్యయం చేయబడుతోంది.

16. ఒక ప్రక్క విదేశ వ్యాపారంలో లోటు, మరోప్రక్క తీసు కొన్న అప్పుల చెల్లింపు, అప్పులపై వడ్డీల చెల్లింపు-ఈస్థితిలో అప్పులు తీర్చేందుకు మరికొన్ని అప్పులు చేస్తూ పోవటమేతప్ప విముక్తిలేదింక. ఆర్థికంగా అప్పులపై ఆధారపడాల్సిన స్థితిలోకి నెట్టబడ్డాం.

17. దేశీయ వనరులను సద్వినియోగం చేసుకోకలిగే రీతిలో పరి పాలన చేయకుండా, ఒక దశాబ్దంలోనైనా తీర్చలేనంతగా అప్పుల పాల్జేసిన ప్రభుత్వం ఇది. విదేశమారకం అప్పు 36 వేల 855 కోట్లకు పైగా ఉంది. మన తలతాకట్టు పెట్టయినా, దానిని తీర్చివేయక తప్పదు. విదేశీ రుణంపై వడ్డీ చెల్లింపు 1034 కోట్లు.

18. 4 దశాబ్దాల పార్టీ ప్రభుత్వాల పాలనలో, మన నెత్తిపై

మోయలేని అప్పుల భారంపడింది. ప్రతి ఒక్కరూ విదేశాలకు బాకీపడ్డా ఇది పన్నుల, అప్పుల ప్రభుత్వం. ఎందుకిలాంటి ప్రభుత్వాన్ని అధి రంలో కొనసాగనిస్తున్నారు?

# 4. అధిక ధరలు

1. ఈ పార్టీ ప్రభుత్వాల పాలనలో, అధికధరల పీడ వ్య ఏనాటికీ తొలగవు? ఎందువల్ల? పరిశ్రమలకు పంటపొలాలకు గల పూ ఉత్పాదక శక్తిని ఉపయోగించేట్లు చేయటంగాని, ఉత్పత్తి ఖర్చుల తగ్గించకల్గటంకాని చేయలేదు. ఉత్పత్తిదార్లపై నియంత్రణలేదు. ఉత్ త్తులు తగ్గిపోవటాన్ని సైతం నిరోధించలేదు. ఆకారణంగా పెరిగే ధర పెరిగే జనాభాచే, ఉత్పత్తి వాడకం పెరిగింది. జనాభా పెరుగుదల; అవసరాలకు సరిపడా ఉత్పత్తిని సాధించటం, ఈ ప్రభుత్వంవల్లకాదు.

2. సక్రమ పంపిణీ వ్యవస్థలేని ఈ ప్రభుత్వానికి, ధరల అదుపు అనేది ఏర్పడదు.

3. సరకులను దాచివేసే, కృత్రిమ కొరతలను సృష్టించే వా అడ్డుకొనలేదు. నల్లడబ్బును అరికట్టలేని ప్రభుత్వం, నల్లడబ్బుచే జరి చట్టా వ్యాపారాన్ని అరికట్టలేదు.

4. సరఫరాకన్నా గిరాకి ఎక్కువగా ఉంటున్నది. ఆకారణం పెరిగే ధరలను అదుపుచేసే సామర్థ్యం ఈ ప్రభుత్వాలకు లేదు. ఎక్క సరకుకు ధర ఎక్కువ పల్కితే అచ్చటకు అక్రమ రవాణా, ఎక్కువ ధర కోసం పొరుగు దేశాలకు దొంగ రవాణా వంటివి, పూర్తిగా అరికట్టలే ప్రభుత్వంవల్ల; స్థానికంగా కొరతలు ధర పెరగటం వంటి ఇబ్బందుల తప్పించలేనివి.

5. ఈ ప్రభుత్వం, ఉత్పత్తిదార్లు వ్యాపారస్తులు దళారుల అక్ర అర్జనకు తోడ్పడుతుందేకాని; వినియోగదార్ల శ్రేయస్సును పట్టించుకోద,

6. స్వదేశీవిదేశీ పెట్టుబడిదార్ల గుత్తాధిపత్యాన్ని అరికట్టలేక, వారి దోపిడీని అనుమతించే ప్రభుత్వంవల్ల; ఏనాటికీ హెచ్చు ధరలే. ప్రభుత్వ రంగ సంస్థలలో అసమర్థతా నిర్వహణవల్ల, తరచూ పెరిగే ధరలే.

7. ప్రభుత్వ పరంగాను, ప్రభుత్వోద్యోగులలోను, ఏనాటికీ తొలగి పోనట్టి; లంచగొండితనం అవినీతివల్ల ధరల పెరుగుదల ఉంటుంది.

8. ప్రజలలో పొదుపు తగ్గి, వినియోగ ప్రవృత్తి పెరిగింది. సక్రమ నిల్వ సక్రమ రవాణా లోపించడంవల్ల, ఉత్పత్తి నష్టపడుతున్నది ప్రకృతి సిద్ధమైన వైపరీత్యాలు సంభవిస్తున్నాయి. రక్షణ అవసరాల కొరకు ఎక్కువ మొత్తాలు కేటాయించవల్సి వస్తోంది. ఇలాంటి పరిస్థితు లను తట్టుకోకలిగి, ధరలను నిలకడగా ఉంచేశక్తి; ఈ పార్టీ ప్రభుత్వాలకు లేదు.

9. ప్రజలను దిగుమతి సరకులపై ఆధారపడినట్లుచేయటంచే-ద్రవ్య మారకం విలువలలో వచ్చే మార్పులవల్ల- దిగుమతి చేసుకొనే సరకుల ధరలు పెరగడంవల్ల- ధరల పెరుగుదల ఉంటుంది. దిగుమతులచే డబ్బు చెలామణి పెరగటం, తద్వారా ద్రవ్యోల్బణ ఒత్తిడికి కారణం ప్రభు త్వమే.

10. జాతీయాదాయం పెరుగుదలకన్నా, ద్రవ్య చలామణి పెరుగు దల ఎక్కువగా ఉంది. చలామణిలో ఉన్న డబ్బు పెరిగేకొద్దీ, ధరలు పెరుగుతాయి. బడ్జెట్ లోటును: క్రొత్తగా నోట్లు ముద్రించి భర్తీ చేస్తు న్నారు. డబ్బు చలామణీపై, ఈ ప్రభుత్వానికి అదుపులేదు.

11. ఒకప్రక్క ధరలను పెరగనిస్తూ, మరోప్రక్క పన్నులు పెంచుతూ, రూపాయి విలువ ఏటా తగ్గింపబడుతున్నది. ఒకనాడు 1-50న పైకి లీటరు పాలువస్తే: అదే 1-50నపైకి నేడు పావులీటరు ఇస్తున్నారు. రూపాయి విలువ పడిపోవటం, డబ్బుకు విలువను తగ్గించటం అంటే అదే.

12. ఉత్పత్తులు ప్రజల అవసరం కాబట్టి, ధరలు ఎలామారు తున్నా కొంటూనే ఉంటారు. దీని ఆధారంగా ధరలు పెంచివేయబడుతుంటే:

సామాన్యులు బ్రతకటమే కష్టం.

13 పంటలకు ధరలు పెంచాలనేడి రైతులవల్ల 2. తమతయారీవస్తువులకు ఎక్కువ ధరలు కావాలనెడి పారిశ్రామికులవల్ల 3. పంపిణీ వ్యవస్థలోని ప్రతి వ్యాపారి ఆశించే అధిక లాభంవల్ల 4. జీతభత్యాలు పెంచాలనెడి కార్మికులు ఉద్యోగులు వల్ల 5. ఏటా లోటుబడ్జెట్ల లోటు తీర్చేదుకు ముద్రించే నోట్లువల్ల 6. పరిశ్రమలకు అవసరమైన ముడిసరకుల అందించే రీతిలో, వ్యవసాయాభివృద్ధి లేనందువల్ల-ధరలు పెరిగిపోతూనే ఉంటాయి.

14. ధరలను పెంచటం చేస్తే, ధరలను పెంచుతాయి. ధరల పెరుగుదల పరస్పర ప్రభావం.

15. ప్రభుత్వం; బొగ్గు, ఉక్కు, విద్యుత్, పెట్రోలియం, రసాయనాలు, ఎరువులు, ధాన్యాలు మొదలగు సరకుల- విద్య, వైద్యం, రవాణా, తంతితపాలావంటి సేవల-ధరలను పెంచుతోంది. దాని ఫలితంగా ఉత్పత్తుల ధరలు పెరుగుతున్నాయి.

16. ఉద్యోగుల వేతనాలు పెరిగినా, ఉత్పత్తి ఖర్చు పెరుగుతుంది. ముడిసరకుల ధరలు పెరిగినా, ఉత్పత్తి ఖర్చు పెరుగుతుంది. రవాణా చార్జీలు పెరిగినా ఉత్పత్తి ఖర్చు పెరుగుతుంది నిర్వహణా సామర్థ్యం లోపించినా ఉత్పత్తి ఖర్చుపెరుగుతుంది. ఉత్పత్తి ఖర్చు ఏ కారణంగా పెరిగినా; ధరలు పెరుగుతాయి.

17. ధరలు పెరగటంచే ఖర్చులు పెరుగుతున్నాయి. ఖర్చులు పెరగటంచే, ధరలు పెరుగుతున్నాయి. ప్రభుత్వం ఏమో పన్నులను పెంచేస్తూ, ఖర్చులు ధరలు పెరగటాన్ని నిరంతరాయం జేస్తోంది.

18. పెరిగే ధరలచే, ఖర్చులు పెరిగి, ఆదాయం సరిపోని పరిస్థితి ఏర్పడుతుంది. 2) పెరిగే ధరలచే, ఎగుమతులు తగ్గుతాయి. 3) పెరిగే ధరలచే, ప్రణాళికా ఖర్చు పెరిగి, ప్రణాళికా పథకాల అమలులో విపరీత జాప్యం జరుగుతుంది. 4) పెరిగే ధరలచే: ఉత్పత్తి ఖర్చులు పెరిగి, ఉత్పత్తి లక్ష్యాలు సాధించబడవు. 5) పెరిగే ధరలచే, కొనుగోలుదా

చేతుల్లోంచి డబ్బు మరింత ఎక్కువగా-ప్రభుత్వ ఖజానాలోకి, రైతాంగం, పారిశ్రామికులు, వ్యాపారుల చేతుల్లోకి చేరుతుంది. 6) పెరిగే ధరలచే; బీదరికం పెరుగుతుంది. పేదల కష్టాలు పెరుగుతాయి. జీవన ప్రమాణం పడిపోతుంది.

19. ఏటేటా పెరిగే ధరలే; ఈపార్టీల పాలనలో ప్రజలమనుగడకు పడే శిక్ష.

20. స్వాతంత్ర్యం వచ్చి 4 దశాబ్దాలు గడిచి పోబోతున్నాయి. ఇప్పటికే ఎన్నో వనరులు ఖర్చు అయ్యాయి. వివిధ రంగాలలో సాధించిన అభివృద్ధి ఏమో చాలా తక్కువ. ఆర్థిక వ్యవస్థ తీవ్రమైన లోటుపాట్లకు గురవుతున్నది. ఆర్థిక సమస్యలతో ఆర్థిక దుష్ఫలితాలతో-దేశవ్యాప్తంగా సమస్యల ఉద్రిక్తత, ఘర్షణల తీవ్రత నెలకొన్నాయి.

పార్టీ ప్రభుత్వాలు వాటి పాలన నుంచి ఎంత త్వరగా విముక్తి చెందితే: అంతత్వరగా సమగ్రాభివృద్ధిని సాధించుకో కల్గుతారు. ఇకనైనా జాగుచేయక స్వపరిపాలనా లక్ష్యాన్ని సిద్ధించుకొందుకై, దశదిశలా ప్రతిఘటించండి అందుకు

మీకొకశక్తి, మీచేతుల్లో సాధనమే మాదేశంపార్టీ

# 27. అ వి నీ తి

1. రైతులు పారిశ్రామికులు వ్యాపారులు వృత్తిదార్లు ఇలా ఎవరికైనా, ప్రభుత్వ శాఖలతో పనులు ఉంటాయి. ప్రభుత్వ కార్యాలయాలు ప్రజల సమస్యలను విని పరిష్కరించేవిగా లేవు. పనిపట్ల శ్రద్ధలేదు. గంటలలో జరగాల్సిన పనులు: వారాలు నెలలు కాదుకదా, సంవత్సరాలు కూడా పడుతుంటాయి. ప్రతి పని జరిగేందుకు, శ్రమ కష్టం చికాకు ఎదురవుతోంది.

2. ప్రభుత్వశాఖల పనితీరులో నీతి ఎక్కడ? నిజాయితీ ఎక్కడ? అవినీతి అక్రమార్జన కుంభకోణాలు, నిత్యం పరిపాటి అయ్యాయి. ప్రతి ప్రభుత్వశాఖ పనులు జరిపించటంలో లేదా ఖర్చులు చేయటంలో-కోట్లాది రూపాయలమేర కుంభకోణాలు వెల్లడవుతున్నాయి. అక్రమాలపై అవినీతి ఆరోపణలపై, బదిలీలు సస్పెన్షన్లు అంటారు. విచారణలు అంటారు. అవినీతిని అంతం చేస్తామనెడి ప్రగల్భాలకు మాత్రం కొదవలేదు.

3. ఉద్యోగులు తమ విధులను నీతినిజాయితీతో నిర్వర్తించేలా, చట్టాలను విధిగా అమలు పరచేలా, ప్రజల పనులు సరిగా నెరవేరేలా- ఈ ప్రభుత్వం చేయలేకున్నది. పాఠశాలలు నుంచి విశ్వవిద్యాలయాల అడ్మిషన్లలో, ప్రభుత్వ ఆస్పత్రులందు చికిత్సా సదుపాయాలలో,బ్యాంకుల నుంచి అప్పులు పొందటంలో, స్థిరాస్తుల క్రయవిక్రయ దస్తావేజుల రిజిస్ట్రేషన్‌లలో, ఉద్యోగాలు ప్రమోషన్లు లభించటంలో, రైల్వే టిక్కెట్ల రిజర్వేషన్లలో, విద్యుత్ కనెక్షన్లు టెలిఫోను కనెక్షనులలో, రేషనుకార్డులు గ్యాస్ సిలిండర్ల సరఫరాలో-ఇలా వేటిల్లోనైనా ప్రజల పనులు అవినీతి లేకుండా జరుగుతున్నాయా?

4. ప్రభుత్వ కార్యాలయాలలో తమ పనులు జరపకుండా ఎక్కడ నిలిపివేస్తారోనని, తమ దరఖాస్తులు సిఫారసు చేయబడవేమోనని, తమ ఫైలు కదలదేమోనని, తమ బిల్లులు పాస్ అవవేమోనని- ఉద్యోగులకు ఆఖరికి బంట్రోతులకు కూడా దడిసి లంచాలిచ్చి పనులు జరిపించుకొనాల్సి

ఉంటే, అదెంత సిగ్గుచేటైన విషయం. ఏటా పండుగ మామూళ్ళను జబర్దస్తీగా వసూలుచేస్తున్నారు. బంగారం, భూములు, భవనాలు, వాహనాలు, షేర్లు, డిపాజిట్లు-ఇలా ఆస్తులను పెంచుకొంటున్నారు. విలాసంగా గడుపుతున్నారు.

5. అవినీతికి ఆశ్రితపక్షపాతానికి బంధుప్రీతికి అధికార దుర్వినియోగానికి; ప్రభుత్వ యంత్రాంగం ఆలవాలమై ఉంది. కాబట్టే సరకుల అక్రమ నిల్వ, అక్రమ రవాణా, బ్లాక్‌మార్కెట్ సాగుతోంది. చౌకదుకాణాలద్వారా చేసే పంపిణీలో అక్రమాలు ఉంటున్నాయి. ప్రభుత్వ గిడ్డంగులలో నిల్వ ఉంచిన సరకులు మాయమవుతున్నాయి. బొగ్గుగనుల నుంచి తీసిన బొగ్గును, అక్రమంగా అమ్ముకో కల్గుతున్నారు. బొగ్గు కేటాయింపులో అక్రమాలు జరుగుతున్నాయి. అటవీ ఉత్పత్తుల రేట్ల నిర్ణయంలో, అటవీ ఉత్పత్తుల వేలంలో, నిబంధనలు ఉల్లంఘించ బడుతున్నాయి. పెట్టుబడిదార్లకు రాయితీలు ఇవ్వబడుతున్నాయి. పారిశ్రామికులు వ్యాపారులు పన్నులు ఎగవేయ కల్గుతున్నారు. పన్నుల అధికారులకే ఆదాయానికి మించిన ఆస్తులుంటున్నాయి. సాంఘిక అరిష్టాలు కొనసాగటంలో అడ్డేముంది? నేరాలపై అదుపేముంది?

6. ఎన్నో పరిశ్రమలు. అవి నడపబడేందుకు వివిధశాఖల అనుమతి పొందాల్సి ఉంటుంది. పారిశ్రామిక లైసెన్సుల మంజూరులో, పారిశ్రామిక యంత్రాల దిగుమతిలో, పరిశ్రమలకు ముడిపదార్థాల సరఫరాలో ఉత్పత్తులకు ధరల నిర్ణయంలో, వాణిజ్యం కొనసాగటంలో, కాంట్రాక్టులు కుదరటంలో, ఇళ్ళస్థలాలు ప్రభుత్వ భూములు కేటాయింపులో;ఇలాఎన్నో వాటికి లైసెన్సులు పర్మిట్లు కంట్రోళ్ళ పేర, ఎన్నో కుంభకోణాలు జరుగుతున్నాయి. అనేక రీతులలో ముడుపులు సంపాదించుకుంటున్నారు. రాజకీయ పదవులలో ఉన్నవారు, ప్రవేటు సంస్థలతో వ్యాపారవర్గాలతోఅక్రమ లావాదేవీలను కల్గి ఉంటూ, కోట్లాది రూపాయలను స్వాహాచేస్తున్నారు.

7. పాలకులు జరిపే ఒప్పందాలు లావాదేవీలు, ప్రభుత్వంద్వారా

జరిగే కొనుగోలు అమ్మకాలు; ప్రజలకు మంచి ఫలితాలను చేకూర్చేవి కావాలి. జాతీయంగా అంతర్జాతీయంగా జరిపే వాణిజ్య ఒప్పందాలు, ఎగుమతి దిగుమతులలో, పాలకులు అవినీతికి పాల్పడితే, వారికే మోఖారీగా కమీషన్లు లభిస్తుంటాయి. వందలకోట్లను లోపాయికారీగా సంపాదించుకో కల్గుతారు. తద్వారా కల్గుతుండే నష్టాలు దుష్ఫలితాలను అనుభవించేది మాత్రం ప్రజలే. స్వదేశంలోని పరిశ్రమలు మూతపడ్డాసరే, అవసరమైన సరకులు దిగుమతి అవుతాయి. ఆధునిక సాంకేతికతకు బదులు, కాలం చెల్లి నది తెచ్చుకోబడుతుంది నాసిరకంవి అయిన విమానాలు, టాంకులు, కంప్యూటర్లు, భారీ యంత్ర సామగ్రి, కొనుగోలు చేయబడతాయి.

8. అడుగడుగునా అక్రమ లావాదేవీలు, అడుగడుగునా నిధుల స్వాహా. అవినీతి వలననేకదా, చట్టాలను సవ్యంగా అమలుపర్చకపోవటం, తప్పుడు విధానాలను కొనసాగించటం ఉంటోంది. అధికారాన్ని చేజిక్కించుకొందుకు, అధికారాన్ని నిలబెట్టుకొందుకు, అక్రమంగా ఆర్జించేందుకు; ఎన్నోరకాల అవకతవకలు, లంచగొండితనం, నిరాటంకంగా సాగుతోంది. అవినీతి కుంభకోణాలతో రాజకీయ నాయకులకు ఉండే లాలూచీవల్ల;వాటిపై నిష్పక్షపాత విచారణ జరగటంలేదు. ఈపాలనా వ్యవస్థే, అవినీతికి అస మర్థతకు, నిరంతర అవకాశం కల్గించేదిగా ఉంది.

9. అవినీతికి పాల్పడటం అంటే, న్యాయాన్ని అణగద్రొక్కి వేయటమే. అధికారాన్ని దుర్వినియోగం చేస్తున్నట్లే. తమ ఉద్యోగ బాధ్య తలను సక్రమంగా నిర్వర్తించనట్లే. అన్యాయాలు యథేచ్ఛగా కొనసాగు తున్నట్లె. దేశపాలన సక్రమంగా జరగటం లేదన్నమాట.

10. అవినీతివల్ల; దేశ అభివృద్ధికి, ప్రజాశ్రేయస్సుకు, దేశభద్ర తకు ప్రమాదం వాటిల్లింది. అభివృద్ధి పథకాలు ఎలాంటి లొసుగులు లేకుండా, అవినీతిలేకుండా అమలుకాకపోబట్టి, ప్రణాళికాబద్ధమైన ఫలితాలు ఒనగూరకుండా ఉన్నాయి. అవినీతివలనే ప్రభుత్వ సంస్థలకు, ఏటా నష్టాలు వస్తున్నాయి. మంత్రులు అధినేతలు తమతమ స్వార్థం చూసు

కుంటున్నారు తప్పితే; ప్రజల శ్రేయస్సుకు పాలనా లక్ష్యాలకు అంకిత మైన వారుగా లేరు. గత ప్రభుత్వ చరిత్ర అంతా, అవినీతి ఆరోపణలతో కూడి ఉంది. పాలకులని చెప్పుకొందుకే సిగ్గుపడే ఘటనలు ఎన్నెన్నో.

11. తమ దేశ వనరులు దుర్వినియోగమవుతూ ఉంటే; తాము చెల్లించే పన్నులు సవ్యంగా ఖర్చవకుండా నిధులు దుర్వ్యయం అవుతుంటే, తమదేశ అభివృద్ధి భంగమవుతూ వెనుక పడిపోతూ ఉంటే, తమ పనుల కోసం పదేపదే కార్యాలయాల చుట్టూ తిరుగుతూ వృధా వ్యయప్రయాసల పాలవుతూ ఉంటే, తమ పరిస్థితులు నానాటికీ విషమించుతూ ఉంటే, అందుకు బాధపడాల్సినది పట్టించుకోవల్సినది ఎవరు? ప్రజలుకాదా?

12. ఏ అవినీతి అసమర్థత కారణంగా తమకు దుష్ఫలితాలు కల్గుతున్నాయో, అట్టి అవినీతిని ఎదుర్కొనాల్సినది ప్రజలుకాదా. అవినీతిని అసమర్థతను చీల్చి చెండాడేందుకు, మనం ఉద్యమించాలి. మనదేశంలో నీతినిజాయితీలు నెలకొనాలి. అడుగడుగునా శాస్త్రీయత కదలాలి. మనం కష్టనష్టాలు లేకుండా జీవించవలె. మనదేశం ధర్మపథంలో సాగవలె. ప్రజలారా ఈనాడైనా సమాయత్తంకండి. పార్టీ ప్రభుత్వం కాలరాక్షసి. దాని గుప్పిట్లో ప్రజల కనుద్వయం కన్నీటిని వర్షిస్తోంది.

13. ప్రభుత్వ ఉద్యోగులు అధికార్లు మంత్రులు చేసేపనులపై, నిఘా వేసేందుకు 77 కోట్ల ప్రజలం ఉన్నాము. మన శక్తి సామర్థ్యాలు అపారం. అంతటి మనలను పట్టించుకోకుండా ధిక్కరిస్తున్నారు అంటే; అట్టి ప్రభుత్వ యంత్రాంగం మనకెందుకు?

14. ఎలాంటి ప్రభుత్వ నిర్మాణం అవినీతి పనులకు తావివ్వదో- ఎలాంటి పాలనా వ్యవస్థలో ప్రతిపనీ పకడ్బందీగానెరవేరుతుందో-ఎలాంటి ప్రభుత్వం తన విధులలో ప్రజల ప్రమేయానికి వీలుకల్గిస్తుందో- అట్టి ప్రభుత్వము పాలన మీకు అందింప జేసేందుకే

ప్రజలకొక స్వంతపార్టీ మాదేశం

# 28. వార్తా ప్రసార వ్యవస్థ

1. వార్తాప్రసార వ్యవస్థలోగల రేడియో టెలివిజన్ ఏమో, ప్రభుత్వం చెప్పుచేతల్లో నడుస్తోంది. ఇంక పత్రికలు ఏమో. ప్రవేటు యజమానుల చెప్పుచేతల్లో ఉన్నాయి. ఆకారణంగా ప్రజల భావ ప్రకటనా స్వేచ్ఛకు సంకెళ్ళు పడ్డాయి.

2. పార్టీ ప్రభుత్వం రేడియో టి.విని తన చెప్పుచేతల్లో ఎందుకు ఉంచుకుందో తెలుసా? ప్రభుత్వ పాలనవల్ల ప్రాప్తిస్తున్న సాంఘిక ఆర్థిక రాజకీయ సమస్యల నుంచి, వాటి దుష్ఫలితాల నుంచి, ప్రభుత్వ వైఫల్యాలనుంచి, ప్రజా వ్యతిరేకత పెల్లుబకకుండా రక్షించుకొందుకు.

3. ప్రజలందరికి విషయప్రసారం అందించే శక్తివంతమైన సాధనాలు, వినోద సంబంధ ప్రసారాలకు కేటాయించబడ్డాయి. వాణిజ్య ప్రసారాలు, హింస, హత్య, సెక్సును ప్రేరేపించే కార్యక్రమాల కొరకు టి.వియా? దిగజారిన అభిరుచులకు, అనువుగా, మరింత దిగజారుడు కార్యక్రమాలను ప్రసారం చేసేందుకు;రేడియో టి.విలను ఉపయోగిస్తున్నందువల్ల, నష్టపోతున్నది దేశప్రజలే. రేడియో టి.విని పాలకవర్గ ప్రచారానికి ఉపయోగించుకొంటున్నారు.

4. పత్రికలను ముద్రిస్తున్నవి పత్రికా సంస్థలు. పత్రికా నిర్వహణ సంపాదకులది.పత్రికలకు వార్తలను సేకరించి పంపేందుకు 4 వార్తా సంస్థలు ఉన్నాయి. వార్తలను సేకరించి పంపేవారు విలేఖరులు. 1984 ఆఖరుకు మొత్తం వార్తాపత్రికల సంఖ్య 21,784. వాటిల్లో 1609 దిన పత్రికలు ఉన్నాయి. వారపత్రికలు ఏమో 6469 ఉన్నాయి. మిగతావి ఇతర మ్యాగజైన్లు. అవి 16 ప్రధాన భాషలలోను, 76 మిగతా భాషలలోను, కొద్ది విదేశీ భాషలలోను ముద్రణ అవుతున్నాయి.

5. పత్రికలది వ్యాపారదృష్టి. వ్యాపారనిమిత్తం ఇబ్బడిముబ్బడిగా అమ్ముడై పోతుండాలి. అందుకు కావల్సిన మషాలాలు ఏవో, వాటితో

పేజీలను నింపుతారు. అందుకనే పత్రికల విలువ చదువుతున్నంత సేపే. సంస్కరణలు సామాజిక మార్పుకు అవి అతిదూరం. అవి ప్రజల కొరకు ముద్రితం అవటంలేదు. తమ అమ్మకాలను పెంచుకొంటూ లాభాలను ఆర్జించేందుకు, స్వప్రయోజన పరుల ప్రయోజనాలను కాపాడేందుకు ప్రచురింప బడుతున్నాయి. పాలకవర్గాన్ని ఎదిరించి పత్రికలు కష్టాలను కొని తెచ్చుకోవు. పత్రికలు పార్టీ ప్రభుత్వాలకు లోబడి, తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పరిమితం చేసుకొన్నాయి.

6. గత దశాబ్దాలుగా పత్రికలనుంచి వర్తమాన సమస్యలను తెల్సుకొంటున్నారు. అయినా ఈ సమాజాన్ని సరిదిద్దుకోగల స్థితిశక్తి, ప్రజలకు లభ్యపడిందా? లేదు. పాలనా పరమైన వైఫల్యాలు తొలగింప బడే పద్ధతులు ఇవీ-అవినీతి అసమర్థత దురన్యాయాలు వైదొలగిపోయే పద్ధతులు ఇవీ- దొంగతనాలు దోపిడీల నిర్మూలన ఇలా- అధిక ధరలు అక్రమ నిల్వలు నిత్యదోపిడీ తొలగిపోయే విధానాలు ఇవీ-సమస్యల పరిష్కారము సమస్యారహిత జీవితము ఇలాగు అని, పత్రికా వ్యవస్థ ప్రజలను చైతన్యం దిశగా మరల్చలేకపోయింది.

7. పత్రికలు ఇంటింటికి చేరుతున్నాయి. ఇల్లు కదలకుండానే విషయాలు తెల్సుకొనవచ్చు. ఇంటింటికి రేడియో విన్పిస్తుంది. ఇంట్లో ఉంటూనే వేటినైనా వినవచ్చు. ఎంతో వ్యయప్రయాసలతోగాని సానుకూల పడనట్టి బహిరంగ సభలు సమావేశాలు, గ్రామ పట్టణ నగరాల పర్యటన జరపనవసరం లేకుండానే; ప్రజలకు ఏదైనా విన్పించటంలేదా వేటిగూర్చి అయినా చదివింప చేయటం అనెడి అవకాశం, వార్తాప్రసార వ్యవస్థచే లభిస్తుంది. అయినా ఏమి ప్రయోజనం?

8. వార్తాప్రసార వ్యవస్థ; పాలకుల, పత్రికా యజమానుల, పారిశ్రామికుల, నిర్బంధాలు ఆంక్షలకు లోబడి పనిచేస్తున్నది. ఆకారణంగా మేధావులు సంస్కర్తలు ప్రజలకు చెప్పదలచుకున్న విషయ వివరణలు ఏవైతేకలవో; వాటిని వార్తాప్రసార వ్యవస్థద్వారా ప్రజలకు తెలియజేసి, ప్రజాభిప్రాయాన్ని వెలికితీసే ప్రక్రియకు, అవకాశం లేకుండాపోయింది. ఆకారణంగా ప్రభుత్వాన్ని అదుపుచేసే శక్తి ప్రజలకు లేకుండా ఉంది.

అందుచే ప్రభుత్వము ప్రజలకు భయపడటం లేదు. ప్రజలను పట్టించు కోవటంలేదు. వారి ఇష్టారాజ్యం అయ్యింది.

9. ప్రభుత్వ అధీనంలో దేశం ఉంది. దేశవనరులు ఉన్నాయి. మిలి యన్లకొద్దీ ఉద్యోగులు ఉన్నారు. మరి ఇట్టి ప్రభుత్వాన్ని అదుపుచేసేందుకు ప్రజలవద్ద ఏముంది?ఎప్పుడో 5 సం॥ కొకసారి జరిగే ఎన్నికలవల్లఎలాంటి ప్రయోజనం లేదు. ఆ ఎన్నికలైనా మాయాజాలం.

10. ప్రభుత్వాన్ని రద్దుచేయటంలేదా మంత్రులను పాలకులను దించివేయటం అనేది; ప్రభుత్వంపై ప్రజలకుగల అధికారం అది. ఈ ప్రజాధికారానికే ప్రభుత్వం భయపడుతుంది. ప్రజాధికారం పనిచేయకల్గ టానికి, ప్రజలదైన వార్తాప్రసార వ్యవస్థ నెలకొనాలి.

11. వార్తాప్రసార వ్యవస్థ ప్రజల స్వంతమైననాడే, ప్రభుత్వ పాలనా లోపాలను చూస్తూ ఊరుకోక, వాటిని ఎదుర్కొనకల్గుతారు. ప్రభుత్వ విధానాలలో లోపాలను అరికట్ట కల్గుతారు. పత్రికా సంస్థలు వార్తాసంస్థలు ప్రజల స్వంతంగా ఉంటే, సంపాదకులు విలేఖరులు ప్రజలు నియమించు కున్న ఉద్యోగులుగా ఉంటే, పత్రికా రచయితలకు స్వతంత్రతలభిస్తే అట్టి పత్రికలు ప్రజల చేతుల్లో ఆయుధంగా పనిచేస్తాయి.

12. వార్తాప్రసార వ్యవస్థను ప్రజాధీనంలో పనిచేయించుకొందుకే, సరికొత్త ప్రజాప్రభుత్వం ఏర్పడాలి.

13. ప్రజా యంత్రాంగంలో వార్తాప్రసార వ్యవస్థ అంతర్భాగంగా పనిచేసేందుకే స్వపరిపాలన.

14. ప్రజలకు ఒక శక్తిని, ప్రజలకు ఒక అధికారాన్ని, నిరంత రంగా ఉంచేందుకే ఈ ఉద్యమం.

15. ప్రజాస్వామ్యాన్ని కాపాడుకోగలిగే శక్తి, పాలకుల నియం తృత్వాన్ని ప్రతిఘటించేశక్తి, ప్రజల చెప్పుచేతల్లో ప్రభుత్వం నడిచేలా నియంత్రించే శక్తి; లభింపజేసే వార్తాప్రసార వ్యవస్థను, ప్రజల స్వంతం జేద్దామన్న సంకల్పం

నెరవేర్చేందుకే మాదేశం పార్టీ

# ము గిం పు

1. పరిపాలన అంతా ప్రభుత్వ వైఫల్యాలతో కూడి ఉంది. ప్రభుత్వపాలనలోని ఎన్నెన్నో లోపాలచే, ప్రజానీకమంతా కష్టాల పాలవుతున్నారు. పరిపాలించటం చేతకాని వారికి; ఓట్లద్వారా అధికారాన్ని అప్పగిస్తూ, నిరంతర దుస్థితులకు గురవుతున్నారు. ఇది యదార్ధంకాదా?

2. ప్రభుత్వాధికారాలు అన్నీ ప్రజల సంక్షేమం కొరకు ఉపయోగింపజేయాల్సినవి. అందులో సందేహంలేదు. మరి మంత్రులు తమకు,తమ ఆశ్రితులకు వర్గప్రయోజనాలకు, అనువుగా ఉపయోగించుకొంటూ ఉంటే; అట్టి ప్రభుత్వాలను తిరస్కరించాలా? వద్దా?

3. దేశాధికారంపై ఏ కొందరో పెత్తనం వహిస్తుంటే, దేశాధికారాన్ని ఏకొందరో చేజిక్కించుకోవటాన్ని, మీరంతా వ్యతిరేకించాల్సిన విషయంకాదా?

4. ప్రభుత్వాన్ని అధికార ధన పదవీ వ్యామోహాలకు అతీతంగా మలచేందుకు, ప్రజాస్వామ్యాన్ని ప్రతిబింబించే పాలనకొరకు, ఈ పరిపాలనను మరోరీత్యా నిర్వహించుకొనాల్సినది ఉందా? లేదా?

5. ప్రభుత్వాన్ని పార్టీలు కైవసం చేసుకుంటున్నాయేతప్ప, క్షుద్ర రాజకీయాలు కొనసాగుతున్నాయేతప్ప, ఎన్నికలు ఓట్లపేర రాష్ట్రకేంద్ర ప్రభుత్వాలు ఏర్పడుతున్నాయేతప్ప-ప్రజల ప్రభుత్వం ఏర్పడుతున్నదా? లేదని వివరించవలెనా?

6. ప్రజలు సత్పరిపాలనను కోరుతుంటే, గతం నుంచి నేటికి దుష్పరిపాలనానుభవాలే ఎదురవుతున్నాయేమి? ఎన్నాళ్ళిలా?

7, పౌరరాజ్యం అవతరించేది ఎన్నడు? పౌరుల కష్టాలు తొలగేది ఎన్నడు? పౌరహక్కులు యధార్థం అయ్యేది ఎప్పుడు? పౌరజీవనం సంతోషమయం అయ్యేది ఎప్పటికి? దీక్ష వహించిననాడే కదా.

8. దుష్పరిపాలనపై పులిలా గాండ్రించరేమి? స్వార్థపూరిత ప్రభుత్వాలపై ఏనుగులలా ఘీంకరింపరేమి? అవినీతి అసమర్థతా ప్రభుత్వాలపై కొదమ సింహాలలా దుమకరేమి? కదలండి తరలండి ధర్మసామ్రాజ్య అవతరణకై.

9. స్త్రీపురుషులారా అదృష్టము దురాదృష్టము అనేవి, ఎక్కడో లిఖితమై అమలు అగుటలేదు. మన భూభాగం నుంచి నిరంతర కానుకలుగా లభిస్తున్న, వివిధ వనరుల సద్వినియోగ దుర్వినియోగాల నుంచే, మనుగడ సంతోషభరితమో దుఃఖభరితమో అగుతున్నది. నేడైనా మేల్కొనండి.

10. నీటి కదలికలా రోజు గడిచిపోతున్నా, నదీప్రవాహంలా జీవితం గమించిపోతున్నా, సాగరసంగమంలా జీవితం లయమైపోతున్నా, కదలరేల మరోనవ ప్రపంచమునకై.

11. జీవితం కారుమేఘాలలా
జీవితం కీకారణ్యంలా
జీవితం నిభిడాంధకారంలా
జీవితం అగ్నిజ్వాలలలా
బలియైపోతుంటే ఇంకామౌనమా?

12. ప్రజలు తమ దురాదృష్టానికి ఆవేదనకు దారిద్ర్యానికినిందించుకొనాల్సినది ఏదీలేనట్టి, సమాజ ఆవిర్భావంకొరకు- మాదేశంపార్టీ ఒసంగుతున్న పిలుపు ఇది. మీకోసం మీరంతా కదలండి రథసారథులులా.

